# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 16-11-1978 | సంచిక 2

## —* ఈ సంచికలో *—



1—12—78 సంచికలో కవిరాజ శిఖామణి కవితాహేల, ఆముక్తమాల్యద-రాయల కవితా వైశిష్ట్యము, చమత్కారమంజరి మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# పురుషార్థ సుధానిధి

ధర్మస్కంధము - పంచమాధ్యాయము

గార్హస్థ్య శ్రైష్ఠ్యప్రతిపాదనము (గృహస్థాశ్రమ ప్రాశస్త్యము)

మూలము : శ్రీ సాయణాచార్యులు.

సూతుడు మునులతో నిట్లు పలికెను. గృహస్థాశ్రమము బ్రహ్మచర్యాదిచతురాశ్రమములలో నుత్తమమైనది. పితృదేవతలు మునులు భూతములు, మనుజులు గృహస్థు నాశ్రయించి తృప్తులగుచున్నారు. గృహస్థు సర్వ ప్రాణులకు పరమాధార మనుట నిస్సంశయముగా సత్యము. గృహస్థాశ్రమప్రశస్తిని వివరించు కథను చెప్పెదను వినుడు.

పూర్వము రుచి యను ప్రజాపతి మమకారాహంకార విహీనుడై, మితశాయియై సంచారముచేయుచుండెను. అగ్ని విహీనుడు, గృహరహితుడు, దినమున కొకచోట నివసించుచు సంచరణ శీలుడు, నిస్సంగుడునైన వానిం జూచి పితృదేవతలిట్లు పలికిరి. "నాయనా! స్వర్గమోక్షములకు, సంతానోత్పత్తికి, కారణమగు పవిత్రమైన దారసంగ్రహము నేల చేయలేదు? గృహస్థు సమస్త దేవతలకు ఋషులకు అర్చకుడు. పితృదేవతలకు స్వధాకారముచేతను, అగ్న్యాదిదేవతలకు స్వాహాకారముచేతను సేవచేయుచున్నాడు. అన్నదానముచే భూతములను అతిథులను సేవించుచున్నాడు. నీవిట్లుండుట వలన దేవఋణాదులచే దినదినమునకు బద్ధుడవగుచున్నావు. పుత్రప్రాప్తి నందక దేవతలను, పితృదేవతలను సంతృప్తి పరచక, దానాదికము నెరవేర్చక మూఢుడవై సుగతి నందగోరుచున్నావు. నీకీవిషయమున క్లేశమే కలుగునని తలంచుచున్నాము. ఇట్టిచో మృతునకు నరకము, మరొక జన్మలో బాధపడుట తప్పవు కదా!

రుచి వారి మాటలు విని యిట్లు పలికెను. 'ధార సంగ్రహము దుఃఖాధిక్యమును పాపమును, అధోగతిని కలిగించును. ఇంద్రియ సంయమనము వలని యాత్మనియమము ముక్తికిహేతు వగును గాని దారసంగ్రహము కాదుకదా! మమకార మను పంకముచే లిప్తమైనను నిష్పరిగ్రహమైన యాత్మ, చిత్తజలముచే కడుగబడుచున్నది. ఇంద్రియ నియమవంతు లగు పండితులు బహుజన్మ కర్మపంక చిహ్నితమైన యాత్మను సద్వాసనాజలముచే శుద్ధిచేయుదురు కదా!'

పితృదేవతలు వాని మాటలను విని 'ఇంద్రియ నియమము కలవారు ఆత్మ ప్రక్షాళనం జేసికొనవచ్చును. నీవనుసరించు మార్గము లోపమును గల్గించదా! ఋణత్రయవిముక్తుడైన పురుషుడు పూజార్హుడు కదా! శుభాశుభఫలముచే పూర్వకర్మ ననుభవింపక తప్పదు. కారణాత్మకమగు కర్మ ఆచరించువానికి బంధము కాదు. పూర్వకర్మ భోగానుభవముచే క్షీణించును. సుఖదుఃఖాదిక రూపమైన పుణ్యాపుణ్య స్వరూపమైనకర్మ ప్రక్షాళనమొనర్చి యార్తి బంధమును విడిపించుచున్నది. అవివేకముచే నిట్టిపాతక మొనర్చిన నెట్లు?' అని పలికిరి.

రుచి వారి మాటలకు "పితృదేవతలారా! వేదములు కర్మమార్గ మవిద్యయని చెప్పుచుండగా నన్ను మీరందు ప్రవర్తింపజేయుచున్నారేమని ప్రశ్నించెను. పితృదేవతలు 'కర్మ అవిద్యయే. కాని విద్యాప్రాప్తికి కర్మహేతువగును. విహితకర్మ ననుసరించని యసత్పురుషులట్టి యవిద్యనందుచున్నారు. సంయమము ముక్తి నిచ్చును. దానిని వీడిన నధోగతియే. కాని యిట్టిసంయమము ముక్తినీయదు. ఇట్టి స్థితిలో నీ వాత్మక్షాళనమొనర్చుకొనునట్లు తలతు వేమి? విహితకర్మ నాచరింపక పోవుటవలని పాపములు నిన్ను దహించును. కావున నీవు యథావిధిగ దారసంగ్రహ మొనర్పుము. లౌకికమగు నీజన్మ వ్యర్థముకారాదు" అని సమాధాన మిచ్చిరి. రుచి వారిమాటలువిని వృద్ధుడను దరిద్రుడనునైన నాకు కన్య నెవ రిత్తురు? దారసంగ్రహము నెట్లు చేయుదు ననెను. అంతట పితృదేవతలు మాపతనము, నీ యధోగతి నిశ్చితములు. త్రికాలాత్మకమగుమామాటను వినకుంటివని యదృశ్యత నందిరి. రుచి వారిమాటల కుద్విగ్నత నంది కన్యాభిలాషియై భ్రమింపసాగెను. తగినకన్య దొరకక చింతాక్రాంతుడయ్యెను. "ఏమి చేయుదును? ఎక్కడకు పోదును? వివాహ మెట్లగును? పితృదేవతలకానంద మెట్లు కలుగును?" అని విచారించి, కమలోద్భవుడగు బ్రహ్మకై తప మాచరింపసాగెను. నియతుడై దివ్యవర్షశతము తపమాచరించి బ్రహ్మసాక్షాత్కారము నందెను. బ్రహ్మ ప్రసన్నుడనైతిని. వరమునుకోరుకొమ్మనెను. రుచి పితృదేవతల యాశాసనమును తెలిపెను. బ్రహ్మ వాని వాంఛితమును విని నీవు ప్రజాపతివి కాగలవు. ప్రజలను సృష్టింతువు. వారిని సక్రియులనుగా నిలిపి నీయధికారమును ప్రకటించుకొని సిద్ధినందగలవు. పితృదేవతలయానతి ననుసరించి దార సంగ్రహము నొనర్పుము. పితృపూజన మొనర్పుము. వారు సంతుష్టులై భార్యాపుత్రులనే కాక సమస్తము నిత్తురు" అని యవ్యక్తజన్ముడగు బ్రహ్మ పలికి యంతర్ధానమయ్యెను.

పిమ్మట నాతడు నదీపులినమున పితృతర్పణ మొనరించి వివిధమంత్రములచే నర్చించెను. పిమ్మట తేజశ్చక్రము వానిముందట సాక్షాత్కరించెను. అందుండి రుచి పూజితములైన పుష్పాద్యలంకారములతో పితృదేవతలు వెలువడిరి. రుచి వారికి నమస్కరించి నిలిచెను. వారు వరముకోరుకొమ్మనగా నాతడు బ్రహ్మవరమును వివరించెను. దారసంగ్రహాభిలాషను వెల్లడించెను. పితృదేవతలు ప్రీతులై "నీభార్య యిందుండియే పుట్టును. ఆమెయందు

( తరువాయి ౩ వ పేజీలో )

# తెలుఁగులో కథాకావ్యములు

— శ్రీ కశవరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.

ప్రపంచమందలి సర్వసాహిత్యములందును ప్రచుర ప్రచార ప్రశస్తుల నంది సాహిత్యమును సర్వోపగమ్యము చేసిన సాహిత్య ప్రక్రియ 'కథాకావ్య ప్రక్రియ'. సామాన్య మానవుని సాహిత్య కామనకు ప్రథమ సోపానము కథాశ్రవణప్రవణత్వము. వినోదార్థముగాని విజ్ఞానాభివృద్ధికిగాని, భావనాశక్తి ప్రరోచనకుగాని, పరిహాస పరిణతికిగాని, ప్రపంచవృత్త ప్రకటనకుగాని కథా కథనమే కర్తవ్యము. జీవితంలో కవిత వినని లేక వ్రాయని మానవుఁ డుండవచ్చును గాని ఎదో ఒక సందర్భములో కథవుఁడు గాని మానవుఁ డరుదు. అందులకే ఆ బాలగోపాలము కథలంటే మక్కువ చూపుతారు. సద్యోహృద్యము, సహృదయ నైవేద్యమునై, రసప్రసారమునకు, నీతిప్రవచనమునకు, ఆదర్శధర్మపథనిర్దేశమునకు ఇంతగా తోడ్పడు సాహిత్య ప్రక్రియ మఱొకటి లేదు. కనుకనే కడమ సాహిత్య ప్రక్రియలకంటె కథాకావ్య ప్రక్రియ బహుధా సహృదయామోదము వడసి వర్ధిల్లినది.

వెయ్యేండ్ల పంట యగు ఆంధ్రసాహిత్యమును ఈ కథాకావ్యప్రక్రియ తేజస్వంత మొనర్చినది. అయితే తెలుఁగులో స్వతస్సిద్ధముగా నిది ఆవిర్భవింపలేదు. సంస్కృత కథాకావ్యము లాధారముగ తెలుఁగున కథాకావ్యములు వెలసినవి. బహుధా సంస్కృత సాహిత్య ప్రవణులైన ఆంధ్రకవులు సంస్కృత కథాకావ్య ఖని నుండి ఎన్నియో అనర్ఘ రత్నములను సేకరించి తెలుఁగులోనికి తెచ్చుట మన యదృష్టము. మాతృస్తన్యము గ్రోలి దిన దిన ప్రవర్ధమానయగు శిశువుంబోలి ఆ సంస్కృత సాహిత్యపు పాదునుండి బాహిరిల్లిన తెలుఁగు కథాకావ్య వాఙ్మయము నొక స్వతంత్రశాఖగా త్రివిక్రమావతారము దాల్చుట అపూర్వము.

కథాశబ్దమునకు వ్యుత్పత్తి 'కథ్యతే ఇతి కథా' అని, అనఁగా చెప్పఁబడునది యని యర్థము. కాని చెప్పఁబడిన ప్రతిదీ కథయని వ్యవహరింపఁబడుట లేదు. కథ యను శబ్దము ఒకానొక నిర్దుష్టార్థముననే నేడు ప్రయుక్తమగుచున్నది. అట్టియెడ కథాకావ్య మను మాటకును విశేషార్థమున్నటుల స్పష్టమగును. కావ్యమునకు ఇతివృత్తము (వస్తువు = కథ) శరీరము. వస్తురహిత కావ్యము ఉండదు. ఏదేని ఒక భావము నాశ్రయించి కవిత వెలయించినను తద్గత భావము వస్తువగును. కాగా వస్తురహిత కవిత (కావ్యము) ఉండదనుట స్పష్టము. మఱి కథాకావ్య మన్నదానికి అర్థము విచార్యము. ప్రబంధాదులయందలి కథలు సుప్రసిద్ధములు, శ్రుతపూర్వములు, పురాణేతిహాసాదుల యందలి కథలను నిజ ప్రతిభా కల్పనా విశేషముతో కవులు, సర్వాంగీణ సౌష్ఠవమగు మసృణమనోజ్ఞ కావ్య (ప్రబంధ) ముగ తీర్చిదిద్దిరి. అనఁగా వీనియందలి కథలు ప్రఖ్యాతములు లేక మిశ్రములు. కాని కథాకావ్యములందలి కథలు ఉత్పాద్యములు లేక కల్పితములు. వీనికి మూలము జాతి జనశ్రుతి. అంతేగాక కవులు తమ అతిలోకమైన ఊహాశాలిత నుండియు, అతివిశాలమైన అనుభవ సామ్రాజ్యమునుండియు కథా కల్పన మొనరించి కథాకావ్య సౌధములు నిర్మించిరి. కథాకావ్యము లందలి కథలు (ఇతివృత్తము) అభూత కల్పనలతోను, అమానుషకృత్యములతోను, అద్భుత సంఘటనా వైచిత్రితోను సమ్మేళన మందియుండును. ఇవి 'హేతుదృష్టి' (Rational or logical thinking) కి నిలువకున్నను, సత్యదూరములయ్యును పాఠకుల నాహ్లాదపరచుటలో అందెవేసిన చేయిగ ముందంజ వేయుట గమనార్హము. స్వభావసిద్ధముగాక ఆరోపిత లౌకికత్వముతో కథాకావ్య కథలు నిండియుండుటయు గన్పట్టును. కథాకావ్యములందలి కథలు సాధారణముగ నేదో యొక నీతినిగాని, ధర్మమునుగాని, సత్యమునుగాని, తత్త్వమునుగాని బోధించునవియైయుండును. కథాకావ్యములందు కవిదృష్టి కథాకథనమునందే లగ్నమైయుండును. వర్ణనాదు లున్నను అవి ఔపచారికములు. అంతేగాక కథాకావ్య కవి ప్రతిభాసంపన్నుఁడును, ఊహాశాలియు నైనచో వస్తుసుందరి వంపుసొంపులు సంతరించుకొని పొంకబింకములతో అలరారును. లోకజ్ఞుఁడైనచో కథలందు అనంతము, అగాధమునగు మానవ జీవితపు మారుమూల కోణములు సహితము ముంగిట నిల్చి మురిపెము గొల్పును. మఱి కవిస్వభావక్రమ కవితాగుణ గరిష్ఠుఁడైనచో అతని కథ లాద్యంతము కవితాకన్యక చందన చర్చచేసి కళ్యాణతిలకము తీర్చిదిద్దినట్లుండును. కవి గతమగు ఈ భేదము వలననే కథాకావ్యములందు వైరుధ్యము కన్పట్టును. మొత్తముమీద ఉత్పాద్యేతివృత్తముతో అద్భుత రస ప్రధానముగ, శృంగారాదు లంగరసములుగ, అభూత కల్పనలతోను, అమానుష కృత్యములతోను నిండి, వాస్తవమునకు (Reality) హేతుబుద్ధికి కొలదిదూరముగా నుండి, ప్రశస్తధర్మోపదేశకములును, సునీతిపథాయత్తములు నైయుండి బహుధా భావబాంధవ్య

భాస్వంతములగునవి కథాకావ్యములని నిర్వచింపవచ్చును.

కాగా ఆలంకారికులదృష్టిని స్థూలముగ గమనింతము. అగ్నిపురాణము గద్య భేదములను ఇట్లు పేర్కొనినది.

"ఆఖ్యాయికా కథా, ఖండ
కథా, పరికథా తథా
కథానికేతి మన్యంతే
గద్యకావ్యంచ పంచధా"

వీనిలోకథ,ఆఖ్యాయిక పరిశీలనార్హములు వీనిని భామహుఁడు (క్రీ.శ. 500 - 700) తన కావ్యాలంకారములో నిట్లునిర్వచించినాఁడు. (1) సోచ్ఛ్వాసాఖ్యాయికా మతా। (2) వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్। (3) వక్త్రం చాపర వక్త్రం చ కావ్యే భావ్యర్థశంసి చ (4) కవేరభిప్రాయకృతైః కథా (థ ?) నే కైశ్చిదఙ్కితా। (5) కన్యాహరణ సంగ్రామ విప్రలమ్భోదయాన్వితా ॥ (కా.అం. 1-25, 27) ఇవి ఆఖ్యాయిక లక్షణములు. కాగా కథ. (1) 'న వక్త్ర పర వక్త్రాభ్యాం యుక్తా' (పైమూడవ అంశమునకు వ్యతిరేకము) (2) నోచ్ఛ్వాసవత్యపి (1 కి వ్యతిరేకము) (3) అన్యైః స్వచరితం తస్యాంనాయకేన తు నోచ్యతే (2 కి వ్యతిరేకము). సంస్కృతమందు కథాకావ్యములను ఆఖ్యాయికలనియు, కథాకావ్యములనియు అందురు. వీనిని ఇంచుక భేదముతో భామహుడు పైవిధముగ నిర్వచించెను. పై ఆఖ్యాయిక, కథా భేదములలో ఆఖ్యాయిక యందలి 4,5 అంశములు కథలో ఉండునో లేదో భామహుఁడు విస్పష్టపఱచలేదు. భామహుని మతమున ఆఖ్యాయిక, కథ వేఱు. ఆఖ్యాయిక ఉచ్ఛ్వాస విభాగాంకితము. నాయకుఁడు స్వచేష్టితమును చెప్పుకొనును.వక్త్రాపరవక్త్రముల నెడివృత్తములు (Metres) కావ్యార్థశంసులుగ నుపయోగింపఁబడును. కన్యాహరణసంగ్రామ విప్రలంభాదులు వర్ణితములు. కాని కథ యందు వక్త్రపరవక్త్రము లను వృత్తములు ప్రయోగింపఁబడవు. ఉచ్ఛ్వాస విభాగముండదు. కవి.కాని ఇతరులుకాని వక్తలుగ నుండనోపుదురు. అంతేగాక సంస్కృతం సంస్కృతా చేష్టా కథాపభ్రంశభాక్ తథా' అని ఇంకొక భేదము కూడ చెప్పినాడు భామహుఁడు. అనఁగా ఆఖ్యాయికయందు భాష సంస్కృతము. కథయందు భాష సంస్కృతము కావచ్చును లేక అపభ్రంశము కావచ్చును. కాని దండి (క్రీ.శ. 600 - 700) దీనిని ఖండించి కథాఖ్యాయికలకు భేదము లేదని స్పష్టపఱచినాఁడు. 'తయోరాఖ్యాయికా కిల ॥ నాయకేనైవ వాచ్యాన్యా నాయకేనేతరేణవా। అపిత్వనియమో దృష్టస్తత్రాప్యన్యైరుదీరణాత్। అన్యో వక్తా స్వయం వేతి కీదృగ్వా భేదకారణం।' (కావ్యాదర్శము. 1-23, 25) అంతేకాదు 'వక్త్రం చాపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకమ్॥ చిహ్నమాఖ్యాయికా యాశ్చేత్ప్రసఙ్గేన కథాస్వపి ॥ ఆర్యాదివత్ప్రవేశః కిం న వక్త్ర పర వక్త్రయోః। భేదశ్చదృష్టోలమ్భాదిరుచ్ఛ్వాస సోవాస్తు కిం తతః॥ (కా.ద. 1-26, 27). కాగా వక్త యెవఁడైనను కావచ్చును. అందువలన కలుగు విశేషమేమియు లేదు. పరిచ్ఛేదవాచకములగు ఉచ్ఛ్వాసము లంబము ఇత్యాదులలో నేది యున్నను ఒకటే. వక్త్రపర వక్త్రములచేత భావ్యర్థమును కథలో చెప్పుట అనవసరమని బంధించు అవసరము ప్రయోజనము శూన్యము. కావుననే తత్కథాఖ్యాయికేత్యేషా మేక సంజ్ఞా ద్వయాంకితా! అత్రైవాంతర్భవిష్యంతి శేషాశ్చాఖ్యాన జాతయః ॥ (కా. ద. 1-28). భామహుఁడు తనకు పూర్వులగు పతంజలి కృత ఆఖ్యాయికలను, బాణకృత కథానామ కాదంబరిని దృష్టిలో నుంచుకొని పైలక్షణము నేర్పరచెను. హర్షచరితములో బాణుఁడు 'ఉచ్ఛ్వాసాన్తే ప్యఖిన్నాస్తే వక్త్రో యేషాం సరస్వతీ। కథమాఖ్యాయికాకారా న తే వంద్యాః కవీశ్వరాః' (హ. చ. అవ. 10 శ్లో) అని నుడివినాఁడు. దీని ననుసరించినాఁడు భామహుఁడు. కాని దండి వీనికి అభేదము కల్పించినాఁడు. దండి దశకుమార చరిత్రలో భామహుఁడు నుడివిన కథాఖ్యాయికల లక్షణములు రెండును గలవు, దశకుమార చరిత్రమే తెలుఁగులోనికి (అనూదితమైన) మొట్టమొదటి కథాకావ్యము. అందుకే పై విచారము.

---

( 1 వ పేజీ తరువాయి )

మన్వంతరాధిపతియై నీ పేరుతో నొప్పు రౌచ్యుడు పుట్టును. వాడు మహా ప్రసిద్ధి నందును. వానికి బలశాలులైన కుమారులు పలువురు పుట్టుదురు. నీవు వారిని తగుపనులందు నిలిపి ప్రజాపతివి కాఁగల వని పలికిరి. పిమ్మట నానదీ మధ్యమునుండి ప్రమ్లోచయనునప్సరస మనోహరాకృతితో పుట్టెను. ఆమె రుచిని జూచి మధురస్వరముతో "వరుణపుత్రుడగు పుష్కరునికి నాయందుపుట్టిన మాలిని యను నీ కన్యను భార్యగా గ్రహింపుము. మనువగు పుత్రుడీమెయందు జనింపగల డనిపలికి మాలిని నిచ్చి శాస్త్రసమ్మతముగ వివాహ మొనర్చెను. రుచి యామెపాణిగ్రహణ మొనర్చి, రౌచ్యుడను మహాతేజస్వియగు పుత్రునిఁ గనెను. పితృదేవతలను దరింపఁజేసెను. గార్హస్థ్యమును సార్థకముగావించెను.

కావున ప్రయత్నవంతుడై గృహస్థాశ్రమము నాశ్రయింపవలెను. బ్రహ్మచారి గార్హస్థ్యమును విడిచి మరొక యాశ్రమమగు సన్న్యాసము నాశ్రయించిన తత్ఫలము నందలేడు. పగటి యంతమున పక్షులు వృక్షము నాశ్రయించినట్లు ఆకలిగొన్నభూతములు గృహస్థు నాశ్రయించును.

సంస్కృత కథాకావ్యములను తత్కర్తలను దిఙ్మాత్రముగ పరిశీలింతము. ఋగ్వేదమునందును, ఛాందోగ్యోపనిషత్తునందును కథలు గలవు. కథాకావ్యలక్షణ యుతమగు మొట్టమొదటి గ్రంథము బౌద్ధవాఙ్మయమందలి 'మహావైపుల్య సూత్రము' లభ్యము. తదుపరి గుణాఢ్యుని "బృహత్కథ". భారతీయ కథాకావ్య వాఙ్మయమునకే భిత్తిపెట్టిన ఈ గ్రంథము క్రీ. శ. 1 వ శతాబ్ది నాఁటిది. పైశాచీ ప్రాకృత భాషలో వ్రాయఁబడినది. కౌశాంబి రాజైన ఉదయనుని కుమారుఁడగు నరవాహనదత్తుని సాహసకార్యములు చిత్రవిచిత్రముగ, అద్భుతరస ప్రధానముగ వర్ణితములు. ఆంధ్రులైన శాతవాహనుల ఆస్థానకవి గుణాఢ్యుఁడగుట ఆంధ్రుల తపఃఫలము. ప్రత్యక్షముగ కాని పరోక్షముగ గాని అనంతరము వెలసిన సంస్కృత కథాకావ్యముల కిదియే మార్గదర్శక మనుట సత్యదూరము గాదు. కాశ్మీర దేశస్థుఁడగు క్షేమేంద్రుఁడు "బృహత్కథామంజరి" యను పేరను, నేపాళదేశస్థుఁడగు బుధస్వామి "బృహత్కథాశ్లోక సంగ్రహ" మను పేరను బృహత్కథను సంస్కృతీకరించిరి.

అనంతరము ప్రపంచ ప్రసిద్ధ సాహిత్యము లన్నింట పరివర్తన మొంది నిస్తుల ప్రశస్తి వడసినది విష్ణుశర్మ కృత 'పంచతంత్రము'. ఇందలి పాత్రలు పశుపక్ష్యాదులు. కథలన్నియు ఉత్తమ నీతిబోధకములు. క్రీ. శ. 3వ శతాబ్దంలో వెలసిన ఈ గ్రంథమునకు ఏబదికి పైగా ప్రపంచ భాషలలో 200 పైచిలుకు అనువాదా లున్నట్లు ప్రొఫెసర్ జొహాన్నస్ హార్టిల్ విపుల పరిశోధనా సారాంశం. క్రీ. శ. 531-597 మధ్యకాలంలోనే ఇది బుర్జో (Burgoe) అను రాజవైద్యునిచే పహ్లవీ భాషలోనికనువదింపఁబడినది. దీని ననుసరించి క్రీ. శ. 725 లో అబ్దుల్లా ఇబిన్ - అల్ - ముకప్ఫా (Abdullah Ibnal Mogaffa) 'కలీలా-వా-దిమ్నా' అనే పేరుతో అరేబియన్ భాషలోకి అనువదించాఁడు. ఆ తరువాత అనేక ప్రపంచ భాషలలోకి పరివర్తితమైన గ్రంథరాజము పంచతంత్రము. దీని సంక్షిప్తరూపము 'హితోపదేశము.' తదుపరి 'సింహాసనద్వాత్రింశిక' లేక 'విక్రమార్కచరిత్ర' పేర్కొనఁదగినది. ఇది 32 కథల సంపుటి. 'భేతాళ పంచవింశతి' 'శుకసప్తతి' వేర్వేఱు సంస్కృత కథాకావ్యములు. ఇవికాక మేరుతుంగుని 'ప్రబంధచింతామణి' 'రాజశేఖరుని ప్రబంధకోశము', హేమచంద్రుని 'త్రిషష్టిశలాకాపురుషచరిత్ర' 'పరిశిష్ట పర్వములు', దండి 'దశకుమారచరిత్ర' బాణుని 'హర్షచరిత్ర' 'కాదంబరి', సుబంధుని 'వాసవదత్త' పేరెన్నికగన్న కావ్యములు. ఆనందధరుని 'మాధూనల కథ' (క్రీ. శ. 10 శ); ధనపాలుని (10శ.)" "తిలకమంజరి" సోడ్ఢలుని 'ఉదయసుందరి కథ (11 శ), విద్యాచక్రవర్తి 'గద్య కర్ణమిత్రము' (12శ.) వాదీభసింహుని గద్యచింతామణి (12శ.) ఉదాహరణీయ కథాకావ్యములే. కాగా భోజుని 'శృంగారమంజరి', రుద్రటుని 'త్రైలోక్య సుందరి' భట్టార హరిశ్చంద్రుని 'మాలతి' జగన్నాథుని 'అశ్వఘవిలాపము' కేవలము నామమాత్రావశిష్టములగు కావ్యములు. వీనిలో కొన్ని మాతృకలుగ, మఱికొన్ని మార్గదర్శకములుగ తెలుగున విశిష్టము విలక్షణము నైన కథాకావ్య ప్రక్రియ రూపు దాల్చినది. సంస్కృత కథాకావ్యములు బహుళముగా గద్యములు. తెలుఁగు కథాకావ్యములు చంపువులు.

ఆంధ్రసాహిత్యమందలి కథాకావ్యములను త్రిధా విభజింపవచ్చును. అవి 1) అనువాదములు. 2) అనుకరణములు. 3) స్వతంత్రములు. వీనిలో ఒక్కొక్క తరగతియందు వెలసిన కావ్యములను స్థాలీపులాకముగ పరిశీలింతము.

అనువాద కథాకావ్యములలో మొదటిది కేతన దశకుమారచరిత్ర. తెలుఁగు కథాకావ్య ప్రక్రియకు శ్రీకారము చుట్టిన వాఁడు కేతన. (క్రీ. శ. 145-1170). సంస్కృతమున దండి గద్యకావ్యముగ దీనిని రచించెను. పదలాలిత్యంతో, మనోహరమైన వర్ణనలతో, సజీవమైన పాత్రలతో, సమకాలీన జీవితచిత్రణ సన్నివేశ సంవిధానముతో, హాస్యవ్యంగ్య సంభాషణలతో, హృద్యమగు కథాకథనంతో సంస్కృత దశకుమారచరిత్ర సహృదయ హృదయైక వేద్యమైనది. దీర్ఘసమాసాలు, శ్లేషలు అచ్చటచ్చట ఉన్నా లలితపద బహుళమైన సుకుమార రచన దండిది. అందుకే "దండినః పదలాలిత్యమ్" అను ఆభాణకము వెలసినది.

'మగధదేశపురాజు మాళవభూపాలునకు ఓడిపోయి కానల పాలవుతాఁడు. ఈయన కొడుకు, మంత్రుల పుత్రులు మొత్తం పదిమంది సంప్రాప్త యౌవనులు కాగానే సాహస యాత్రకు వెళ్ళి ఒకరికి గాకుండా ఒకరు పోతారు. ఒక్కొక్కరు చిత్రవిచిత్ర సంఘటనలలో చిక్కుకొని అపూర్వ జీవితానుభవములు పొందుతారు. దైవాద్వారంతా కలసికొని రాకుమారునికి తమతమ అనుభవాలు వివరిస్తారు. 'ఇదీ ఇతివృత్తం. చదివిన కొలఁది చవులూరించే రచన దండిది. గద్యం కవీనాం నికషం వదన్తి' అన్నదానికి నిదర్శనము దండి. ఇంతటి మనోహరకావ్యం కనుకనే కేతన దీని నాంధ్రీకరించి ఆంధ్ర కథాకావ్య భగీరథుఁడైనాఁడు. 'అంచిత భావ రసోదయాభిరామంగా' పంద్రెండు ఆశ్వాసాల కావ్యంగా కేతన మలచినాఁడు. కేతనది స్వతంత్రానువాదము. మూలమును ఔచిత్య దృష్టితో పరిహరించిన ఘట్టములు, అన్యథాకరించిన సన్నివేశములు కలవు. ముఖ్యముగా శృంగార రసపోషణలో కేతన చూపిన నిగ్రహము ఆంధ్ర

కవులు చాలమందిలో అరుదు. అతివేల శృంగారపరమగు మూలమునందలి వసుమతీ-అంగాంగ వర్ణనను పరిహరించి యథోచితముగ వర్ణించినాఁడు కేతన. "కేతన కావ్యంలో పెద్ద పెద్ద సంస్కృత సమాసాలు ఉండవు. ఆయన చిన్న చిన్న తెలుఁగు మాటలతోనే కథాకథనం చేస్తాఁడు. తెలుఁగుతనం ఉట్టిపడే సామెతలూ, జాతీయాలూ, పలుకుబళ్లూ ఇతని రచనలో ఉన్నాయని శ్రీ ఆరుద్ర. శైలీ లాలిత్యమునకు నిదర్శనము ఈ విరహానునయ పద్యం.

"చెఱుకటె విల్లు! పువ్వులటె
చిక్కని చక్కనియమ్ము! లేయుచో
గుఱియటె చిత్తముల్! హరుఁడు
కోపమునం గనుఁగొన్న నంగముం
బఱిపఱి యయ్యెనట్టె! తల
ప్రాణము లోకువ వచ్చె! నెవ్వరిం
గఱచు ననంగుఁ! డేమిటికిఁ
గంపముఁ జెందెద వంబుజాననా!
(3-129)

సంభాషణోచితమైన, సన్నివేశోచితమైన రచన. విడివిడి చిన్నచిన్న పదాలతో మృదుమధురముగ సాగిన దీతని శైలి. 'తలప్రాణము లోకువ వచ్చె' చక్కని సామెత. అయితే సమాస భూయిష్ఠమైన రచన యందును కేతన చేయి తిరిగిన సెఱజాణే.

"చటుల స్యందన ఘట్టనం దెరలి య
శ్వవ్రాత చంచత్ఖురో
ద్భట పాదాత పదాహతి న్నెగసియు
ద్యద్వారణ శ్రేణికా
కట నిష్యంది మదాంబు వృష్టి నడపం
గా ధూళిజఃపుంజము
త్కట దర్పోద్ధత వృత్తి నొత్తి నడచెన్
దండెత్తి యుద్దండుఁడై"
(11-119)

వీరరసోత్కటమగు నీ ప్రౌఢ సామాసిక శైలి కేతన పాండితీ శౌండీర్యమునకు నిదర్శనము. కాగా 'ఏటికి నెదురీదు మాడ్కి' (3-20) 'తేనియ బడ్డ యీఁగ గతి' (6-30) 'కానఁగాయు వెన్నెల క్రియ' (12-54) ఇత్యాది సామెతలు, 'లేమికంటె నరయన్ మృతి మేలగు' (6-7), 'విధివర్తనం బ్రతి కర్తవ్యంబు' (5-101) 'యౌవనము భోగములకెల్ల నాస్పదంబు' (10-144) ఇత్యాది సూక్తులు కేతన కవితలో కోకొల్లలు. ఇంకొక విశేషము - ఇది 'కవిబ్రహ్మ తిక్కన కంకితము. ఒక కవి ఇంకొక కవికి తన కావ్యం అంకితం చేయటం అరుదు. ఈ సంప్రదాయానికి కేతన ఆద్యుఁడు. కవిబ్రహ్మ మెప్పు వడసెనన కేతన కవితా పాటవమునకు, గ్రంథ ప్రాశస్త్యమునకు వేఱు శతపత్రము అనవసరము. దండికి తెలుఁగున కేతన మెత్తినది కేతన దశకుమార చరిత్ర.

అనువాద కావ్యాలలో రెండవది మంచన కేయూర బాహుచరిత్ర. అయితే దీనికొక విశిష్టత కలదు. మిగిలిన కథా కావ్యములు సంస్కృత కథాకావ్యముల కనువాదములో, అనుసరణములో, స్వతంత్రములో కాగా ఇది సంస్కృతమందలి 'విద్ధసాలభంజిక' యను నాటకము మూలముగా గలట్టిది.

స్థాయిరసము శృంగారం
బై యలవడఁ గథలు నీతులై యెడ
నెడరాఁ
గేయూరబాహు చరితము
సేయుము నీవాంధ్ర భాష శిల్పము
మెఱయన్". (అవ. 11 ప).

అను కృతిపతి గుండనమంత్రి అభ్యర్థనముపై కేతన దశకుమారచరిత్రపద్ధతిలో శృంగారరస ప్రధానముగ నాలు గాశ్వాసముల కావ్యముగ రచించినాఁడు. ప్రధాన కథలో నుపకథ లిమిడ్చి రచించు పద్ధతికి ఆద్యుఁడితఁడు. మూల కథలోలేని 23 ఉపకథలను చేర్చినాఁడు మంచన. పంచతంత్ర, హితోపదేశము లందును, జాతిజన శ్రుతియందును నున్న కథలివి. ఇవన్నియు నీతిబోధకములు. భోజరాజీయము నందలి ఉపకథా సంవిధానమునకు మార్గదర్శకుఁడు మంచన. పోతన కృతముగా ప్రసిద్ధమగు ఈ క్రింది పద్యము మంచనది.

'బాలరసాలపుష్ప నవ
పల్లవకోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁ
గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి మఱి
యంతకు నాయతిలేనినాఁడు గా
ద్దాలికులైన నేమి నిజ
దార సుతోదర పోషణార్థమై.
(1-13)

ఇందలి భావరమ్యతకు, శైలీలాలిత్యమునకు ముచ్చటపడి పోతన ఈ పద్యము గ్రహించి యుండనోపును. జక్కన, అనంతామాత్యుఁడు, అల్లసాని పెద్దన, మున్నగువారు తమతమ కావ్యములలో మంచనను అనుకరించిరన అతని ప్రత్యేకత వేరుగ జెప్ప బనిలేదు. నీత్యుపదేశోచితమగు అతని శైలీ సారళ్యమునకు ఉదాహరణము.

సొమ్ములయెడ నెవ్వారల
నమ్మఁదగదు నమ్మకుండినను జరగదిలన్
సొమ్ము గలవారి కర్థుల
నమ్మఁగ కీడైన నేమనం గలదు తుదిన్"
(1-185)

సులలితపద శోభితమగు నిట్టిరచనయే మంచనకు ఆంధ్రసాహిత్యములో ఉన్నత స్థానము కల్పించినది.

అనువాద కావ్యములలో మూడవది కొఱవి గోపరాజు (క్రీ. శ. 14-15 శ.) కృత 'సింహాసన ద్వాత్రింశిక.' ఇది స్వతంత్ర కావ్యము గాదనియు, నాంధ్రీకరణమనియు ఆయాంధ్రీకరణమును దుష్కరమనియు మనోహరముగ చెప్పిన కవిసత్తముఁ డీతఁడు.

'ఈ సరసోక్తి కావ్య మొకఁ
డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ

కవులు చాలమందిలో అరుదు. అతివేల శృంగారపరమగు మూలమునందలి వసుమతీ-అంగాంగ వర్ణనను పరిహరించి యథోచితముగ వర్ణించినాఁడు కేతన. "కేతన కావ్యంలో పెద్ద పెద్ద సంస్కృత సమాసాలు ఉండవు. ఆయన చిన్న చిన్న తెలుఁగు మాటలతోనే కథాకథనం చేస్తాఁడు. తెలుఁగుతనం ఉట్టిపడే సామెతలూ, జాతీయాలూ, పలుకుబళ్లూ ఇతని రచనలో ఉన్నాయని శ్రీ ఆరుద్ర. శైలీ లాలిత్యమునకు నిదర్శనము ఈ విరహానునయ పద్యం.

"చెఱుకటె విల్లు! పువ్వులటె
చిక్కని చక్కనియమ్ము! లేయుచో
గుఱియటె చిత్తముల్! హరుఁడు
కోపమునం గనుఁగొన్న నంగముం
బఱిపఱి యయ్యెనట్టె! తల
ప్రాణము తోకకు వచ్చె! నెవ్వరిం
గఱచు ననంగుఁ! డేమిటికిఁ
గంపముఁ జెందెద వంబుజాననా!
(3-129)

సంభాషణోచితమైన, సన్నివేశోచితమైన రచన. విడివిడి చిన్నచిన్న పదాలతో మృదు మధురముగ సాగిన దీతని శైలి. 'తలప్రాణము తోకకు వచ్చె' చక్కని సామెత. అయితే సమాస భూయిష్ఠమైన రచనయందును కేతన చేయి తిరిగిన నెఱజాణే.

"చటుల స్యందన ఘట్టనం దెరలి య
శ్వవ్రాత చంచత్ఖురో
ద్భట పాదాత పదాహతి న్నెగసియు
ద్యద్వారణ శ్రేణికా
కట నిష్యంది మదాంబు వృష్టి నడవం
గా ధూరజఃపుంజము
త్కట దర్పోద్ధత వృత్తి నొత్తి నడచెన్
దండెత్తి యుద్దండుఁడై"
(11-119)

వీరరసోత్కటమగు నీ ప్రౌఢ సామాసిక శైలి కేతన పాండితీ శౌండీర్యమునకు నిదర్శనము. కాగా 'ఏటికి నెదురీదు మాడ్కి' (3-20) 'తేనియ బడ్డ యీఁగ గతి' (6-30) 'కానఁగాయు వెన్నెల క్రియ' (12-54) ఇత్యాది సామెతలు, 'లేమికంటె నరయన్ మృతి మేలగు' (6-7), 'విధివర్తనం బప్రతి కర్తవ్యంబు' (5-101) 'యౌవనము భోగములకెల్ల నాస్పదంబు' (10-144) ఇత్యాది సూక్తులు కేతన కవితలో కోకొల్లలు. ఇంకొక విశేషము - ఇది 'కవిబ్రహ్మ తిక్కన కంకితము. ఒక కవి ఇంకొక కవికి తన కావ్యం అంకితం చేయటం అరుదు. ఈ సంప్రదాయానికి కేతన ఆద్యుఁడు. కవిబ్రహ్మ మెప్పు వడసెనన కేతన కవితా పాటవమునకు, గ్రంథ ప్రాశస్త్యమునకు వేయి శతపత్రము అనవసరము. దండికి తెలుఁగున కేతన మెత్తినది కేతన దశకుమార చరిత్ర.

అనువాద కావ్యాలలో రెండవది మంచన కేయూర బాహుచరిత్ర. అయితే దీనికొక విశిష్టత కలదు. మిగిలిన కథా కావ్యములు సంస్కృత కథాకావ్యముల కనువాదములో, అనుసరణములో, స్వతంత్రములో కాగా ఇది సంస్కృతమందలి 'విద్ధసాలభంజిక' యను నాటకము మూలముగా గలట్టిది.

స్థాయిరసము శృంగారం
బై యలవడఁ గథలు నీతులై యెడ
నెడరాఁ
గేయూరబాహు చరితము
సేయుము నీవాంధ్ర భాష శిల్పము
మెఱయన్". (అవ. 11 ప).

అను కృతిపతి గుండనమంత్రి అభ్యర్థనముపై కేతన దశకుమారచరిత్రపద్ధతిలో శృంగారరస ప్రధానముగ నాలుగాశ్వాసముల కావ్యముగ రచించినాఁడు. ప్రధాన కథలో నుపకథ లిమిడ్చి రచించు పద్ధతికి ఆద్యుడితఁడు. మూల కథలోలేని 23 ఉపకథలను చేర్చినాఁడు మంచన. పంచతంత్ర, హితోపదేశములందును, జాతిజన శ్రుతియందును నున్న కథ లివి. ఇవన్నియుం నీతిబోధకములు. భోజరాజీయము నందలి ఉపకథా సంవిధానమునకు మార్గదర్శకుడు మంచన. పోతన కృతముగా ప్రసిద్ధమగు ఈ క్రింది పద్యము మంచనది.

'బాలరసాలపుష్ప నవ
పల్లవకోమల కావ్యకన్యకన్
కూళల కిచ్చి యప్పడుపుఁ
గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి మఱి
యంతకు నాయతిలేనినాఁడు గా
ద్దాలికులైన నేమి నిజ
దార సుతోదరపోషణార్థమై.
(1-13)

ఇందలి భావరమ్యతకు, శైలీలాలిత్యమునకు ముచ్చటపడి పోతన ఈ పద్యమును గ్రహించి యుండవోపును. జక్కన, అనంతామాత్యుఁడు, అల్లసాని పెద్దన, మున్నగువారు తమతమ కావ్యములలో మంచనను అనుకరించిరన ఆతని ప్రత్యేకత వేరుగ జెప్ప బనిలేదు. నీత్యుపదేశోచితమగు ఆతని శైలీ సారళ్యమునకు ఉదాహరణము.

సొమ్ములయెడ నెవ్వారల
నమ్మఁదగదు నమ్మకుండినను జరగదిలన్
సొమ్ము గలవారి కర్థుల
నమ్మఁగ కీడైన నేమనం గలదు తుదిన్"
(1-185)

సులలితపద శోభితమగు నిట్టిరచనయే మంచనకు ఆంధ్రసాహిత్యములో ఉన్నత స్థానము కల్పించినది.

అనువాద కావ్యములలో మూడవది కొఱవి గోపరాజు (క్రీ. శ. 14-15 శ.) కృత 'సింహాసన ద్వాత్రింశిక.' ఇది స్వతంత్ర కావ్యము గాదనియు, నాంధ్రీకరణమనియు ఆయాంధ్రీకరణమును దుష్కరమనియు మనోహరముగ చెప్పిన కవిసత్తముఁ డితఁడు.

'ఈ సరసోక్తి కావ్య మొకఁ
డిమ్ముల సంస్కృతభాష నచ్చు గాఁ

కొంత వేదాంత ప్రసంగం జరుపుతుంది. అందుదొర్లిన ముఖ్యమైన మాటలు కొన్ని "క్షామవాస కథావిశేషములు స్వాప్నిక ముల్ చపలావిలాసముల్." ఆపైన

"అవిరియోడలో, జలధి
యానమొనర్చెడు బాటసారులో
భూవర! రేవులందు దిగి
పోయెదరించుక వెన్కముందుగా
నీ వసుధాపణంబు పని
యెల్ల ముగించి స్వదేశగాములై
పోవుచు వచ్చుచుంద్రు సత
మున్ బ్రజలీ నరజన్మవర్తకుల్"

ప్రజలు నరజన్మవర్తకులట. కాలమనే అవిరియోడలో ప్రయాణించే బాటసారులట. రేవులనే తమ గమ్యాన్ని చేరడమనేది సర్వసామాన్యమయిన విషయం. అయితే తమపని ముగించుకొని వెళ్ళడంలో కొంత వెనుక ముందు ఉండడం సహజం. ఈ మరణ వైరాగ్యాన్నే జాషువా ఈ పద్యంలో ప్రతిపాదించారు.

"విశ్వవ్యాఘ్రి గర్భంబునన్ మాపుల్ రేపులు ఎందఱో యిముడుచున్నారందునేనొక్కతెన్" మానవుడు నిత్యమూ ఎందఱో మృతిచెందడాన్ని చూస్తుంటాడు. కాని తనకు ఒకరోజున అట్టి మృత్యువు కలుగుతుందనే విషయం మనసుకురాదు. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం. కాని ముంతాజ్ తనను సమీపించే మృత్యువును సామాన్యంగా భావించడం విశేషం. తరువాత షాజహాను సతీవియోగ జనిత ఖేదాన్ని అనుభవిస్తూ అనుకొన్న మాటలు అతని వైరాగ్య ప్రవృత్తిని తెలుపుతాయి. శాశ్వతశోకమూర్తి అయి తన చరమజీవిత నాటకరంగంలో విధుర భూమికతో ప్రవేశిస్తాడు. "దాయమన్నీల ప్రాణముల్ దీయగలిగి ఈయుతేడయ్యె నిజ భార్యకాయువులను" అని మానవుని అశక్తతను కవి చక్కగా విమర్శిస్తాడు. అవనికి దూరమై ఎడదకందని స్వర్గము నూహాలోన మానవుడు సృజించినాడనియు, అది అనాథలు పేదలు నిల్వ తావు అనియు భూధవులకు అందు చే[illegible] లేదనియు, తన శౌర్యసంప[illegible] రక్షణ సేయజాలని అరణ్య[illegible] అయినదనియు, "ఉద్దామైశ్వర్యము లింపు సేయునె, కళత్రజ్యోతి చల్లారినన్" అని పలవించి తన జీవితశేషమును అవివాహితుడుగా భార్యకు అంకితము చేయుదునని ప్రతినజేసి యమునపొంతన ఆమె స్మృతి చిహ్నంగా రతనాల సమాధి నిర్మాణానికి నిశ్చయించుకుంటాడు రాజు. ఆసమాధియే తాజ్ మహలు. దానిని యాత్రికులు నేటికిని "కలదే స్వర్గము లాతిచో గలుగనిక్కింబిద్దియే నీతిమంతుల విశ్రాంతి నికేతనంబు" అని కొనియాడుచున్నారు. చివరగా జాషువా తన కావ్యాన్ని ముగిస్తూ

"రాణి విడిచిపోయె రాజు నొంటరిజేసి
రాజు విడిచిపోయె రాజ్యరమను
రాజ్యరమయు విడిచె రాజుల
పెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు"

అని వ్రాసినాడు. ఈ విధంగా తాజి రాజసాన్ని విడువలేదు. ఈ కావ్యము సహృదయ హృదయక్షేత్రాలను వీడలేదు.

పిరదౌసి: ఈకావ్యంలో జాషువా ప్రధానంగా ప్రతిపాదించిన పాత్రలు రెండు. ఒకటి కవికకు రెండవది ప్రభుతకు ప్రతీకలు. అవి వరుసగా పిరదౌసి మహాకవి, గజనీ మహమ్మదు సుల్తాను. కవితకు ప్రభుత చేసిన అన్యాయమే ఇందలి ఇతివృత్తరచన. గజనీమహమ్మదు పిరదౌసీని పిలిపించి 'షానామా' అను గ్రంథమును (రాజచరిత్ర) కంకితము చేయుమనియు, అట్లుచేసినచో పద్యమునకొక్కొక్క బంగారు నాణెమును వెలగట్టి యిత్తుననియు పల్కును. పిరదౌసీ దీనికొప్పుకొని ముప్పదియేండ్లు శ్రమించి అరువదివేల పద్యములు రాసి తీసికొని వెళ్లును. రాజుపసిడి నాణెములకు బదులు వెండి నాణెములు పంపును. పిరదౌసి తన [illegible] యిచ్చి రాజునకు ధనము [illegible] జూపి, నిందాసహోక్తికముగా ఒక [illegible] వ్రాయును. అందు,

'అల్లాతోడని పల్కి నాపసిడి కా
వ్యద్రవ్యమున్ వెండితోఁ
జెల్లింపన్ దొరకొన్నటక్కరివి నీ
చే పూజితుండయినచో
నల్లాకున్ సుఖమే మహమ్మదు నృపా
లా! సత్యవాక్యంబెవం
డుల్లంఘింపడో వాడెపో నరుడు
ధన్యుండిద్ధరామండలిన్"

రాజు సత్యవాక్యోల్లంఘనము చేసినవాడు. అది దోషమని కవి తెల్పినాడు.

'రాజు తలమీద గవి కప్పురంబు సల్లె
సుకవి తలమీదరాజు నిప్పుకలు విసరె
కొందఱే పుణ్యమో చేరుకొనియె ననిరి
కొందఱే పాపమో కట్టుకడిపె ననిరి'

అను మాటలతో కావ్య సారాంశాన్ని ఒక్క పద్యంలోనే కవి సాక్షాత్కరింపజేసినాడు. అయితే ఈకావ్యంలో కవి దరిద్ర జీవితాన్ని, ప్రభుత్వ దురహంకారాన్ని వ్యక్తంచేసాడు. అంతేగాక కవి యొక్క శక్తిసామర్థ్యాలను ఖచ్చితంగా తెలిపినాడు కూడా. ఈవిధంగా కావ్యంలోని రెండుపాత్రలలో మొదటి పాత్రకు యశమును రెండవదానికి అపయశమును కల్గినవి. కవిప్రతిపాదింప దలచిన వ్యక్తుల మధ్యగల తారతమ్యము అంతే.

"నరుని కష్టపెట్టినారాయణునిగొల్చు
ధర్మశీలు రున్న ధరణి మీద
కాలుమోపలేక గబ్బిలమొక్కటే
చరయుగళి దివికి సాచి నడచు"

ఈపద్యం జాషువా 'గబ్బిలం' లోనిది. కాళ్లుపైకిసాచి తిరుగుతూండడం గబ్బిలం ప్రవృత్తి. దీన్ని ఈవిధంగా చిత్రించడంలో కవిప్రతిభ వ్యక్తమౌతుంది. మానవుని కష్టపెట్టి మాధవునీ కొలిచే ధర్మశీలురు (అధర్మశీలురు) ఉన్నటువంటి ఈ ధరణి మీద గబ్బిలం కాలుమోపలేక ఆ విధమైన స్థితిని అలవాటు చేసికొన్నది జాషువాచూపిన ఈకారణం కవి మన

పరిణతిని, భావ వ్యక్తీకరణను స్పష్టం చేస్తున్నాయి. ఇలాగే

"ముక్కు మొగమున్న చీకటి ముద్దవోలె
విహారణము సేయసాగె గబ్బిల మొకండు"

అని గబ్బిలం ఆకారాన్ని వర్ణించిన తీరు పఠితల చిత్తాలను హత్తుకునే రీతిలో నడచింది.

జాషువా కులమత వైషమ్యాన్ని నిరసిస్తూ

"ముసలివాడైన బ్రహ్మకు పుట్టినారు
నలువురు కుమారులనుట విన్నాము గాని
పసరమునకన్న హీనుడభాగ్యుడైన
యైదవ కులస్థుడెవ్వడమ్మా? సవిత్రి!"

పశువుకన్న హీనుడని సంఘం భావించే ఈ పంచమునికి మన ఇతిహాసంలో పుట్టుక ఎప్పుడు జరిగిందో తెలుపుమని నిలదీసి ప్రశ్నించాడు.

శ్మశానవాటి జాషువాగారి సమతావాదమే

"ఇచ్చోట నే సత్కవీంద్రుని కమ్మని,
కలము నిప్పులలోన కరగి పోయె?
నిచ్చోట నే భూములేలు రాజన్యుని,
అధికారముద్రిక లంతరించె?
నిచ్చోటనే లేత యిల్లాలి నల్లపూ,
సలసౌరు గంగలో కలసి పోయె?
ఇచ్చోట నెట్టిపేరెన్నికంగను గొన్న,
చిత్రలేఖకుని కుంచియ నశించె,
ఇది పిశాచులతో నిటలేక్షణుండు
గజ్జె గదలించి యాడురంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టులొలయ
నవని పాలించు భస్మసింహాసనంబు"

అని శ్మశాన వాటిని వర్ణించాడు. ఇంకా 'ఒకానొక నాడల కాళిదాస భారవుల శరీరముల్ ప్రకృతిరంగమున నందిపు డెంతలేసి రేణువులయి మృత్తికం గలిసెనో కద కుమ్మరివాని సారెపై" అనిపల్కి ఎట్టి మహాత్ముల శరీరాలు కూడ శ్మశాన భూమిలో మృత్తికతో కలయునని చరమ సిద్ధాంతం చేసాడు. వెంటనే శ్మశానవాటికి సమతావాద ప్రతిపాదనా లక్ష్యాన్ని ఈ క్రింది పద్యంతో సాధించాడు.

"ఇటన స్పృశ్యత సంచరించుటకు
దావేలేదు, విశ్వంభరా
నటనంబున్ గబళించి, గర్భమున
విన్యస్తంబు గావించి, యీ
త్కటపుం బెబ్బులితోడ మేక నొక
ప్రక్కన్ జేర్చి జోకొట్టియూ
అట గల్పించు నభేదభావమును,
ధర్మంబిందు గారాడెడున్"

ఈ శ్మశాన స్థలిలో అస్పృశ్యత సంచరించుటకు తావులేదనియు, ప్రపంచమును కబళించి తన గర్భమున విలీనము చేసికొనుననియు, పెద్దపులిని, మేకను రెంటిని ఒక ప్రక్కనే జేర్చి జోకొట్టుననియు తెల్పినాడు. బద్ధవిరోధులకు కూడ అభేద భావాన్ని శ్మశానభూమి కల్గిస్తుందనే సత్యాన్ని ఈ పద్యంలో జాషువా ఆవిష్కరింపజేశాడు.

ఈవిధంగా ఖండ కృతులతో అఖండ భావాలను సృజించిన ఘనత జాషువాకే దక్కింది. ఆవేశం తరుముతుంటే కలం అందుకొని కవిత్వం చేసినవాడు జాషువా. లక్షణబద్ధమైన సంప్రదాయసాహిత్యంతో, సలక్షణమైన భావవ్యక్తీకరణతో, సంస్కరణాభిలాష అనే లక్ష్యాన్ని ఉపలక్షించాడు. జీవితంలోని వగరుబాధలను అనుభవించి తీయని కవితలను ఆలపించినందుకే జాషువా 'కవికోకిల' కాగలిగాడు.

*

# స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలా వికాసం

— శ్రీ సోమసుందర్

నేటి నవలాకారులలో చాలమందికి నిత్యజీవితంలోని అనేక సమస్యల సమ్యగవగాహన లేదు. వర్తమాన సమాజస్థితిగతులను గురించిన హేత్వధీనశాస్త్రీయ దృక్పథం లేదు. రచయితకు అవగాహన లేనిదే జీవిత చిత్రణ జరగడం సాధ్యం కాదు. జీవితం బహుముఖమైనది; అందులో వ్యక్తుల పరస్పర ప్రేమ ఒక అంతర్భాగమే తప్ప, అదే సర్వస్వం కాదు. అలాంటిది ప్రేమతప్ప ఇతర విషయాలేవీ వర్తమాన నవలకు ఇతివృత్తంగా సరిపడవన్నంత వెర్రివ్యామోహం నవలాకారులలో వ్యాపించింది. దీనితో సామాజిక వాస్తవికతలోని అసంఖ్యాక సమస్యలు బుద్ధిపూర్వకంగా ఉపేక్షింపబడుతున్నాయి. యథార్థ జీవితాన్ని చిత్తశుద్ధితో పరిశీలిస్తే మన నవలల స్వరూప స్వభావాలు తప్పక మారగలవు. కాని ఈ స్పృహ చాలామందిలో కొరవడుతోంది.

ఆధునిక నవలాసంవిధానంలో స్ట్రీమ్ ఆఫ్ కాన్షస్ (Stream of Concious) టెక్నిక్ అత్యంత నవీనమైనది. దీనికి స్వర్గీయ బుచ్చిబాబు చైతన్య స్రవంతి అని తెలుగులో నామకరణం కావించి ఆ సంవిధానచ్ఛాయలో తమ ప్రఖ్యాత నవల "చివరకు మిగిలేది" రచించారు. ఈ సంవిధానానికి ప్రథమ ప్రవక్త జేమ్స్ జోయిన్, తదుపరి పాశ్చాత్యరచయిత లనేకులీసంవిధానాన్ని స్వీకరించారు. కాని శ్రీమతి వర్జీనియా ఊల్ఫ్ ఒక వైశిష్ట్యాన్ని సంతరించింది. ఈ సంవిధానంలో తెలుగులో వేళ్లపై లెక్కపెట్ట తగినన్ని నవలలు మాత్రమే వచ్చాయి. సర్వశ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి అల్పజీవి, స్వర్గీయ భాస్కర్ భట్ల కృష్ణారావు వెల్లువలో పూచిక పుల్లలు, ఇటీవల నవీన్ (డి మల్లయ్య) రచించిన అంపశయ్య వంటి కొద్ది నవలలో మాత్రమే ఈ సంవిధానం ప్రయుక్తమైంది. ఈ సంవిధానాన్ని స్వీకరించిన పై రచయితలంతా సమర్థులు కావడంవల్ల సంపూర్ణసాఫల్యము నందుకొన్నదే గాని, సామూహికంగా చూస్తే చైతన్యస్రవంతీ సంవిధానం ప్రయోగదశను దాటలేదనిపిస్తుంది.

ఐతే ఈ సంవిధానంలో ఒక లోపం కూడా సిద్ధించక తప్పదు. సాంప్రదాయిక కథన స్వరూపం ఛిద్రమౌతుంది. పాత్ర మనోవైకల్యాలనూ ఆలోచనా ప్రవాహాన్నీ స్వగతస్వరూపంగా చిత్రించవలసి వస్తుంది. అప్పుడు రచయిత ఆలోచనలు సైతం పాత్రల ఆలోచనా వైఖరిపై బలంగా కాలూనక తప్పదు. అంటేరచయిత స్వాత్మక భావనావిభూతులు తప్పని సరిగా చోటుచేసుకోవలసి వచ్చి, యీకాల్పనిక సాహిత్యం పరాత్మకంగా (Objective) ఉండవలసిన మౌలిక లక్షణంనుంచి జారిపోంది. రచయితకీ పాత్రకీ మధ్యగల ఆత్మగత వస్తుగత వైవిధ్యసంబంధాదులు చెడిపోతాయి. పాఠకుని మనస్సులో ఒక కంగాళీ ఏర్పడి చక్కని కళాఖండం కలిగించవలసిన రిలీఫ్ పట్టుతప్పుతుంది. అనవసరభారం మోపబడుతుంది. ఏతావతా పాత్రచిత్రణ సైతం భగ్నమయ్యే అవకాశమూ కలుగుతుంది. ఒక అస్పష్టత ఐచ్ఛికంగా నెలకొల్పబడుతుంది. సంఘటనలనూ, తదధీనంగా పాత్రల మనోవికాసాన్నీ చిత్రించుకుంటూ పోవడంలో నేటివరకూ స్థిరపడిన సంప్రదాయం విచ్ఛిన్నంకాక తప్పదు. దీనివల్ల పాఠకుని హృదయఫలకంపై - ఇతివృత్తంలోని సర్వాంశాలూ పటిష్ఠస్వరూపస్వభావాలతో ముద్రితమయ్యే అవకాశం లుప్తమవుతుంది.

పైగా చైతన్య స్రవంతీ సంవిధానంలో ఈ క్రమ వికాసం బుద్ధిపూర్వకంగా ధ్వంసితమౌతుంది. భూతభవిష్యత్ వర్తమానాలు మూడూ ముప్పేటగా వర్తమానంలో ప్రవాహస్థితిని పొందుతాయి. దీనివల్ల సంప్రదాయజ్ఞుడైన పాఠకునిలో గజిబిజి ఏర్పతుంది.

సమాజవాస్తవికత, సమాజంవలెనే స్థిరబిందువుకాదు. దేశకాల పాత్రలకులోబడి వాస్తవికతాస్వరూపంలో మార్పులు పొడసూపుతూ ఉంటాయి. ఈసత్యం చాలామంది నవీన నవలాకారులు గుర్తించడంలేదు.

నవలకు ప్రధానమైన ఆధారభూమి సమాజం. కనక సమాజపరిశీలనం నవలాకారుడు ఉపేక్షించరాని అనివార్యదర్శన మన్నమాట. ఈ ప్రధానధాతువును ఉపేక్షిస్తే - రచయిత మనోవికారాలు, కేవల స్వాత్మక ఊహాపోహాలు ఆంతరిక సంఘర్షణలు వంటివిమాత్రమే నవలలో దురాక్రమణ చేయవలసివస్తుంది. అప్పుడు సజీవపాత్రలస్థానంలో ప్రేతలు సృష్టింపబడతాయి.

ఆంగ్లసాహిత్యమో, ఇతరభాషాసాహిత్యాలో చదివి, తద్ద్వారా లభించిన ప్రేరణతో తెలుగులో ఒకనవలను కల్పింపదలచినపుడు కూడా ఆ పాత్రలు ఈమట్టిలో పుట్టి, ఈగాలి పీల్చి, ఈనీరు త్రాగి పెంపొందిన మనలో ఒక అవిభాజ్య భాగంగా విస్ఫురణ పొందజాలవు. కేవల పుస్తకగత పాత్రలద్వారా నమూనాలు సృష్టిస్తే, అవి అల్యూమినం పాత్రలవలె కొత్తలో తళతళలాడినా అనతికాలంలో కగ్గి తూట్లు పడిపోతాయి. పాశ్చాత్య స్త్రీలు మనదేశం వచ్చి మనకట్టుబొట్టులకు ఆకర్షితులై చీరకట్టుకుని ఉపన్యసిస్తూండగా నిండుసభలో ఆచీరలు జారిపోయి రసాభాసు ఏర్పడినట్లుగా - రచయిత ఎక్కడో ఒకచోట దొరికిపోవడం సామాన్య విషయమే!

బుచ్చిబాబుగారి చివరికి మిగిలేది అనే నవల ఎంత అద్భుతావహ కళాఖండంగా కీర్తిపొందినా, అందులోని పాత్రలన్నీ తెలుగుదేశపునైసర్గిక పరిస్థితుల్లో పుట్టి పెరిగి, తెలుగువాళ్ళ సుఖదుఃఖాలలో పాలుపంచుకుంటున్నట్లు ధైర్యంగా నిరూపించుకోలేవు. దీనికి ప్రధానకారణం - బుచ్చిబాబు నవల సామాజిక జీవన వాస్తవికతారంగం నుంచి నిష్క్రమించి, రచయిత తాలూకు స్వీయబౌదిక రంగంలో స్వేచ్ఛావిహారం చేస్తున్నట్లు స్పష్టంగా కనిపిస్తుంది. అందువల్లనే బహుశః ఈప్రమాదం వాటిల్లి ఉంటుంది.

19వ శతాబ్దివరకూ వెలువడిన పాశ్చాత్య నవలలలో ఇతివృత్తం ప్రాధాన్యం వహించేది. అంటే నవలకు ఒక ప్లాటు, ఆప్లాటును ఉత్సుకత చెడకుండా ఆవిష్కరించడంలో సన్నివేశాలతో, సంఘటనలతో కూడిన రంగాల వైవిధ్యం మూర్తికట్టడం ప్రాధాన్యం వహించేది. కాని ఇరవయ్యో శతాబ్దపు నవల్లో పాత్రచిత్రణ ప్రముఖ వైశిష్ట్యాన్ని సంతరించుకుంది. ఇది ఆకస్మికంగా ఇరవయ్యో శతాబ్దపు పాశ్చాత్యరచయితలు సాధించిన ఘనవిజయంకాదు. టాల్‌స్టాయి, డోస్టవిస్కీ, బాల్జా అనటోల్ ఫ్రాన్సు, మపాసా, చార్లెస్ డికెన్సు, మున్నగు మహారచయితల అంకురార్పణ నుంచి క్రమవికాసంపొందినదే!

వర్తమానకాలం శాస్త్ర, విజ్ఞాన రంగంలో సాధిస్తున్న ఘనవిజయాలు నేటి మేధావుల ఆలోచనాధోరణులపై అనివార్య ప్రభావముద్రను కలిగిస్తున్నాయి. తదధీనమైన ఆలోచనాధోరణులు ఆవిష్కరింపబడుతున్నాయి. అలాగే రచయితల కళాత్మక సృజనల ప్రభావం శాస్త్రకారులపైని కూడా చూపడం అసహజ పరిణామమేమీ కాదు. సిగ్మండ్ ఫ్రాయిడ్ ఆవిష్కరించిన మనోవిశ్లేషణ విజ్ఞానం ఆధునిక నవలా సాహిత్యంపై ఎంతగానో ప్రభావాన్ని నెరపింది. తత్ఫలితంగా కాస్ట్రీమ్ ఆఫ్ కాన్సస్‌నెస్ టెక్నిక్ గాని, అధివాస్తవికతా సంవిధానంగాని ఉద్భూతమయ్యాయి. ఒక వ్యక్తి నిత్యజీవితంలో భౌతికంగా చర్య ప్రతిచర్యల కెంతఅవకాశముంటుందో, అంతగా మానసికంగాకూడ చర్య ప్రతిచర్యల అవినాభావం విస్తరిస్తూనే ఉంటుంది. కాలం చతుర్థప్రమాణంగా (Dimension) గా గుర్తింపబడ్డాక దాని

చోటుచేసుకుంది. ఒక మానవుని మనోయవనికపై ఏకకాలమందు స్మృతిగా గతమూ, ఆశగా ఆగతమూ కృత్యంగా వర్తమానమూ విడదీయలేనంత అంతర్లీనంగా మూర్తీభవిస్తాయి. గతం అందించిన అనుభవాలూ అనుభూతులూ జాతినీ వ్యక్తినీ స్మృతికిదెచ్చే రూపంలో ఆలోచనావగుంఠనమవడమూ ఆగతంపట్ల అనునిత్యం పెంపొందే ఆశాభావమూ, ప్రణాళికా బద్ధయోచనాధారల వంటివి మనస్సుకు కుడి ఎడమలుగా జలతారంచులను కైసేస్తూ ఉంటాయి.

ఈ వైజ్ఞానిక సత్యాన్ని ఆధారంగా స్వీకరించి, దానిసాహితీ ప్రతిబింబంగా చైతన్యప్రవంతీసంవిధానం ఆవిర్భవించింది. ఈ కాల త్రయీగత అభ్యంతరాలను దొలగించుకుంటూ సాగే పాత్ర మనో వైశిష్ట్యాన్ని అంతర్గర్భీకరించుకుంటూయీ చిత్రణసాగుతుంది. ఈ సంవిధానం ద్వారా మాత్రమే ఒక పాత్ర మనస్తత్వాన్నీ మనోగత కల్లోలాల్నీ పుష్టిగా చిత్రించడం సాధ్యమవుతుందని – ఈ సంవిధాన ప్రవర్తకులూ, ప్రవక్తలూ భావిస్తున్నారు.

ఎంత గొప్పనవలకాని, ఎంత విస్తృతంగా అది సాగడం వల్లకాని – ఒక కాలపు సామాజిక జీవితాన్ని సర్వసమగ్రంగా చిత్రించలేదు. ఆ నవల స్వీకరించిన దేశకాల పాత్రాదులు వాటిపరిమిత జీవితాదులవఱకూ మాత్రం సమగ్రంగా చిత్రించగలిగితే – దానిజన్మ కృతార్థమైనట్లే! ఎంతో కొంత సామాజిక అంతర్భాగాన్ని చిత్తశుద్ధితో సజీవంగా చిత్రించి, సామాజికులపై ప్రభావముద్ర కలిగించిందన్నమాటే! ఒక నవల రాయడానికి ఆ రచయిత స్వీకరించిన జీవితరంగపు పరిధి ననుసరించి, రచయిత విశ్వసించే తాత్త్విక దృక్కోణాన్ని అనుసరించీ దాని అభివ్యక్తిలో సామాజిక మూర్తుల ప్రతిబింబాల ప్రదర్శనలో రచయితకు గల శక్తియుక్తులననుసరించీ ఆ నవల సాధించే విజయం ఆధారపడుతుంది. తదనుసారంగానే జీవిత వాస్తవికత కూడా ఆధారపడి వుంటుంది.

మాబాబులో చిత్రింపబడినదీ అరుణలో చిత్రింపబడినదీ యథేచ్ఛాలైంగిక వ్యాపారంతో ప్రవర్తించే సమానధర్మాలు గల స్త్రీ పాత్రలే, అయినా, పైరెండు నవలలూ పాఠకునిలో కలిగించే ప్రభావముద్రలూ, మనోవైకల్యాలూ ఒకేమాదిరివికావు. అలాగే ఇటీవల కుమారి వాసిరెడ్డి సీతాదేవి సృష్టించిన సమత అనే నవల ఒకానొక యథార్థ జీవిత వృత్తానికి ప్రతిబింబంగా, స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన మంత్రాంగాల భ్రష్టాచారం ఇతివృత్తంగా సాగింది. అందలి నాయిక పాత్రకూడా లైంగికంగా స్వేచ్ఛాజీవనం సాగించడమేగాక, తన సౌందర్యంతో పాలకులకు పాలకురాలుగా రాజకీయాలను తీర్చిదిద్దగలిగేదిగా ఉంటుంది. అలాగే స్వర్గీయ గోపీచంద్ చే స్వతంత్ర సృజనగా కళాఖండంగా తీర్చిదిద్దబడిన చెరగని మరకలలోని ప్రధానపాత్రకూడా స్వైరిణిగానే తనచుట్టూ రకరకాల పాత్రలను త్రిప్పుకుంటూ వాళ్లపై తన తిరుగులేని ప్రభావాన్ని కలిగిస్తుంది. పైని పేర్కొన్న నాలుగు నవలలూ సమాన జీవనధర్మాలు గల నాయికలతో సాగినవే అయినప్పటికీ – ఆ యా రచయితల స్వాత్మకదృక్పథాన్నిబట్టి, కళానైపుణ్యాన్నిబట్టి, అవి ఆ యా రీతులుగా పెంపొందాయి. మొదటి నవల మాబాబులో ఆంగ్లేయుల పరిపాలన వల్ల భారతీయమైన ఆర్ష ధర్మ వ్యవస్థ భిన్నమై యథేచ్ఛావ్యాపారానికి ప్రేరణ కలుగుతూ జాతికి వినాశనస్థితి సంభవించిందన్న రచయిత బాధ – అసంకల్పితంగా అభివ్యక్తమవుతుంది. రెండో నవల అరుణలో వేద కాలంనుంచీ క్రమానుగతంగా భారత స్త్రీ బానిసగా మారిపోయిందన్న రచయిత స్వాత్మక బాధతో సమకాలీన కృతకనీతులకు నిర్బంధ పాతివ్రత్యానికీ వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన విప్లవకారిణిగా అరుణ వ్యక్తిత్వం రూపొందింది, యీపితూరీతో ఏకకాలమందు అనేకులను ప్రేమిస్తూ అనేకులచే ప్రేమింపబడుతూ, పొగలోంచి సెగలోకి – పెనం మీదనుంచి మంగలంలోనికీ తానుదుమికి, స్త్రీజాతిని ధ్వని ప్రధానంగా ఉద్బోధిస్తుంది. పాశ్చాత్య జీవనసంపర్కం మన జడ జీవితాన్ని సంస్కరించిందన్న గౌరవభావంతో చలంగారి దర్శన సాగుతుంది. ఈ రెండూ స్వాతంత్ర్యానికి చాలా పూర్వం వెలువడిన నవలలే! అయినా సమతలోని స్త్రీపాత్ర చిత్రణకూ, చెరగని మరకలులోని స్త్రీ పాత్ర చిత్రణకు పైరెండు నవలలలోని నాయికా పాత్ర చిత్రణకు తులనాత్మక పరిశీలనలో సహకరిస్తాయని వాటిని ఇక్కడ ఉట్టంకించడం జరిగింది. ఈ రచయిత లందు వారివారి దృక్కోణాలననుసరించి, ఆ యా పాత్రలను చిత్రించి, పతితలలో తమవిశ్వాసాలకు అనుకూల ఆలోచనా ధోరణులను ప్రోదిచేసేందుకు ప్రయత్నించడం మనకు స్పష్టంగా ద్యోతకమవుతుంది. స్వాతంత్ర్యానంతరం పరిస్థితుల్లో ఆంధ్ర రాజధానిలో సిఫార్సుల మేడమ్‌గా ప్రసిద్ధిగాంచి, మంత్రుల హృదయాలను కంటికొన మెరుపులతో స్వాయత్తంచేసుకొన్న అరుంధతిపాత్ర సమతలో బహురామణీయకంగా చిత్రితమైంది. జాతికి ఒకదశాబ్దికాలం ఈసిఫార్సుల మేడమ్ ఒకమహామ్మారిగా రూపొందడం సర్వవిదితమే. ఇదేపాత్రను లీలామాత్రంగా స్వీకరించి శ్రీగోపీచంద్ గడియపడని తలుపులు అనే చిన్న నవల రాశారు. ఒకే జీవిత వాస్తవికతను ముడిపదార్థంగా సంగ్రహించిన వేర్వేరు రచయితలు వారి స్వీయ జీవితదృక్పథాలను, విశ్వాసాలను, ప్రత్యయాలనూ (Concepts)

సిద్ధాంతాలను అనుసరించి ఆ యా పాత్రలను తీర్చిదిద్దడంగాని, వాటికి ఆ యా పరాకాష్ఠలనూ, ముగింపులనూ కలిగించడంగాని జరుగుతూ ఉంటుంది. కనుకనే కేవలస్వాత్మక (absolute subjective) సాహిత్యంగాని లేదా కేవల పరాత్మక (absolute objective) సాహిత్యంగాని ఉండటానికి అవకాశంలేదని ఒక ప్రఖ్యాత విమర్శకుడు చెప్పిన మాట ఎంతో సత్యమనక తప్పదు. జీవిత ఇతివృత్తమొక్కటైననూ ఒక్కొక్క వ్యక్తి నిష్ఠమైన కథనరీతి, సంవిధాన చాతుర్యమూ, జీవన వ్యాఖ్యానాలు ఇతరేతర వ్యక్తి లక్షణాలను భేదించడం సర్వసాధారణమే.

ఇక్కడే మరొక్క విషయం చెప్పుకోవలసి ఉంటుంది. ఎంతగొప్పకళాశిల్పిగా ఒకనవలాకారుడు ఒకనవల రచించినా అది సమకాలీన జీవనపరిస్థితులపరిధి నుంచి దాటిపోలేదు. అనగా కొన్ని దశాబ్దాల క్రితంగాని, లేదా కొన్ని శతాబ్దాలక్రితంగాని అవిష్కృతమైననవలలో ఆ నవలారచనకు సమాంతర కాలపరిస్థితులే ప్రభావం కలిగిస్తాయికాని,కొన్నేళ్ళ భవిష్యత్ జీవన పరిస్థితులను చిత్రించలేవు. అయితే మానవతా ధర్మాలలో త్రికాలాబాధిత సత్యాలు మాత్రమే కాలంతో పాటు మారేవి కావుకనక అవే పాఠకుని హృదయంపై చెరగని ముద్రలు కలిగించి ఒకనవలకు చిరాయువును కలిగిస్తాయి. ఒక గ్రంథం కళాఖండం కావాలేతప్ప - సమకాలీన సమస్యలను ఇతివృత్తంగా స్వీకరించినంత మాత్రాన అవి అర్థాయుష్కాలుకావు. రామాయణ కాలంనాటి సమస్యలుగాని, మహాభారతరచనా కాలంనాటిసమస్యలుగాని, శరతబాబుకాలంనాటి సమస్యలుగాని,కన్యాశుల్కం నాటిసమస్యలుగాని యీనాటి దేశీయస్థితిగతుల్లో కానరానంత మాత్రాన ఆయాగ్రంథాలు మరణించకపోవడానికి ఆ యా గ్రంథాలలో గల సార్వకాలిక, సార్వజనీన మానవతా ధర్మాల చిత్రణమే ప్రధానకారణమని మనం నిస్సందేహంగా చెప్పుకోవచ్చు. Crime and Punishment రాసిననాటి రష్యన్ స్థితుగతులెంతగా మారాయో ఆనాడు డోస్టవిస్కీ ఊహించనైన ఊహించలేదు. ఆయన తిరిగి ఏ ఇంద్రజాలంవల్లనైనా నేటి సోవియట్ రష్యాకు తిరిగిరావడం తటస్థపడితే - తన మాతృదేశంకాదన్న సందేహంపొడమినా ఆశ్చర్య పడనక్కరలేదు. అంతగా మారిన నేటి సోవియట్ పౌరులకు ఆనాటి పరిస్థితులు కేవలం గ్రంథాల ద్వారా తప్పితే అనుభవైక వేద్యాలుకావు. అయినా డోస్టవిస్కీ,గొగోల్, తుర్గనీల్, గొంచర్‌స్కీ టాల్‌స్టాయిల వంటి మహారచయితల గ్రంథాల నాదేశవాసులెంత విరివిగా చదువుతున్నారో - మాస్కోలోని ప్రచురణాలయం వారి రిపోర్టులు చూస్తే తెలుస్తుంది.

అలాగే ఏదేశంలోనైనా ఆనాడు రచించబడిన ఒక నవలలో ఈనాటి జీవిత ప్రతిబింబం ఉండవలసి అవసరం లేదు. 1930 లలో రచించబడిన వేయి పడగలు గాని, అడవి బాపిరాజుగారి నారాయణరావుగాని - సమకాలీన జీవితాన్ని కథాత్మకంగానూ శక్తివంతంగానూ ప్రతిబింబించ లేకపోవడమే దోషమవుతుంది తప్ప-పూర్తిగా గతంలో తల దూర్చడమూ తప్పుగాదు. వర్తమానం నుంచి గతాన్ని పరామర్శించి, ఆగత కాలావధిని దీర్ఘదర్శిగా చూడ గలిగిన వాడే ద్రష్ట. నవలారచయిత అయినా కవి అయినా క్రాంతదర్శి కావాల్సిందే. క్రాంతదర్శి హృదయం త్రిపుటి! అంటే దృక్కు, దృశ్యము, ద్రష్ట. ఈ మూడూ ఒకే సమ్మేళనం పొందిన విశిష్టశక్తి! ఏ కాలపు సాహిత్యంలోనైనా, సాహిత్యకారుని లింగ భేదంతో నిమిత్తంలేకుండా మనం ఆశించదగిన శక్తులవే! ఈనాటి మన ఆలోచనాధోరణులనూ, విశ్వాసాలనూ, ఊహాపోహాలనూ, భౌతిక సమస్యలనూ 1941 లో ఒక నవల రాసిన రచయిత చిత్రించవలసిన పూచీ ఎంత మాత్రం ఉండదు. కాని ఆనాటి సమాజవాస్తవికతపట్ల భక్తిశ్రద్ధలుకాని, బాధ్యతలుకాని పరిశీలనా నైశిత్యంగాని లేని రచయిత అచ్చమైన కళాశిల్పిగా తన సృజన ద్వారా నిరూపించుకోజాలడు.

పైన పేర్కొన్న దర్శన ప్రదర్శన శక్తులు గాఢంగా గల ప్రతిభావంతుడు నవలలోని పాత్రలను యథోచితంగా సమకాలీన భూమికపై స్వేచ్ఛగా పెరగనిస్తాడు. పాత్రల ఆలోచనాధోరణులకు వైశాల్యం కలిగిస్తాడే తప్ప - స్వీయ ఆలోచనలను వాటిపై రుద్దడు. పాత్రల హావభావ విశేషాలతో తనవైయక్తిక ప్రమేయాన్ని సంధించి తన చెప్పుచేతల్లో ఆడే కీలుబొమ్మలుగా రూపొందించడు. శ్రీ విశ్వనాథ రచించిన నీలమ్మ పెళ్లి అనే నవల ఒకటుంది. అందులో ఒక స్త్రీపాత్ర విశ్వనాథవారికన్న విద్వాంసురాలు! అల్లే మ్రోయు తుమ్మెద అనే ఎంచక్కని నవలలో విశ్వనాథ సత్యనారాయణ అనేపాత్రనే నేరుగాప్రవేశపెడితే తప్ప ఆయనకు దుగ్ధ తీరలేదు. ఆపాత్ర ప్రవేశంతో అంతవరకూ ఆనవల కలిగించిన ఒకానొక మాధురీధురీణమైన భ్రమావరణం భళ్ళున బద్దలై - పాఠకుని గుండెపట్టునుంచిజారి ఆ నవల సమూలంగా కూలిపోతుంది. సర్వేసర్వత్రా విశ్వనాథ సత్యనారాయణగారి నవలల్లో సంభవించే తీవ్ర ప్రమాదం యిదే! వారి కళాత్మక ఆవరణను వారి చింతనాత్మక

(తరువాయి 12 వ పేజీలో)

# శ్రీనాథుని భాష - నుడికారము

- డా॥ నేతి అనంతరామశాస్త్రి, ఎం. ఏ., పిహెచ్. డి.

నుడికారము నే, పలుకుబడి - జాతీయము - పదబంధము అను పర్యాయపదములతో పేర్కొనుట కలదు. నుడికారమునకును పలుకుబడికిని భేదము పదముల అర్థమునందైనను లేదు. జాతీయమునకు భాషాసంప్రదాయసిద్ధమనియర్థము. పదబంధము పదముల విశిష్టబంధ మనునర్థము నే యిచ్చును. కాని దానినికూడ నుడికారమునకు తుల్యముగ నేడు వాడుచున్నారు. నుడికారము భాషా సంప్రదాయము నే కాదు జాతి యొక్క సంప్రదాయమును కూడ తెలియపర్చును. సామెతలవలెనే నుడికారములును భాషకు ప్రవాహశీలమును ప్రసాదించును. సాంప్రదాయికమై సముజ్జ్వలత్వమును సమకూర్చును.

ప్రతిమానవుడు తన మనోభావముల నన్నింటిని ఎదుటివారికి చెప్పుటకు క్రొత్త మాటలు క్రొత్తభావచ్ఛాయలు ఏర్పడుచుండును. విడిగా పొడిమాటలవలె నున్నవే అపూర్వసమ్మేళనమున అపూర్వ భావవ్యక్తీకరణకు మూలములై విశిష్టపద బంధములుగా భాషలో నిలిచిపోవును. వానినే పదబంధములని, నుడికారములని పలుకుబడులని, జాతీయములని పేర్కొనుచున్నాము. శ్రీనాథుని కావ్యములలో సంతరింపబడిన నుడికారమును వివరించుట కొకప్రత్యేక గ్రంథము చాలదు. కావున ముఖ్యమైనకొన్ని నుడికారములనుగూర్చి యిట వివరింతును.

1. అందని మ్రాఁకుపండ్లు గోయఁదలఁచుట : [శృ. నై 2_63]

వృథాప్రయాసపడుట యని యర్థము.

2. అడుసులోపలఁ దాటిపండడుముట : [కాశీ 1_114]

తడిమట్టియందు తాటిపండు నదిమి త్రొక్కుట యెంత తేలికయో, యంత తేలికగా నణగద్రొక్కుట.

3. అట్టుకడుపును జల్లగా నభిలషించుట [భీమ 4_82]

దీవించుటయని యర్థము. అభ్యంగన స్నానసమయమున తలపై నూనెపెట్టుచు నీయమ్మ కడుపు చల్లఁగా నీయత్తకడుపు చల్లఁగా... అని శుభము నభిలషించు నాచారమునుబట్టి యేర్పడినది. ఇక్కడ 'కాలకూటాగ్ని సంహారకారియుభవు' నుద్దేశించి పరమేశ్వరునికడుపుచల్లగా నభిలషించుట జరిగినది. అనగా 'లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు' అని స్వస్తి పలుకుట

4. ఆవగింజలు తాటికాయలుగ నాడుట [శృ. నై 7_119]

లేనిపోనివికల్పించి అతిశయముగా చెప్పుట యని యర్థము. ఆవగింజంత చిన్న విషయమైనను దాని కనేకరెట్లుకల్పించి పెద్దదైన తాటికాయవలె పెంచిచెప్పుట.

5. ఇరుచెవి యెఱుఁగకుండ [భీమ 4_50]

అత్యంత రహస్యముగా అని యర్థము. రెండవకంటివానికి తెలియకుండ నని నేటివాడుక.

6. ఈఁగకే నిలి యిడని: [శృ. నై 7_53]

చాల లోభియని యర్థము. ఇలియిడు_ అనగా ఎంగిలిమెతుకులు విదిలించుట. ఈఁగను దానిపైనను వ్రాలనీనయంతటి లోభి యని పైనుడికారమున కర్థము.

7. ఈఁగకుబోఁక యిడినట్లు : [క్రీడా 245]

ఆసక్తిలేకుండుట. ఈఁగలు పోఁకల పై ముసరవు. కారణము పోఁక యీఁగకు కొరుకుడుపడదు కావున.

8. ఈలగ్రద్ద: [శృ. నై 7_107]

ఈలగ్రద్దయనగా క్రూరుఁడు. ఒకసారి యిచ్చియు, లోభమువలన దానిని తిరిగి క్రూరముగా లాగికొనువాడు. ఈలగ్రద్దయనగా నీలవేసెడి యొకజాతిగ్రద్ద. గ్రద్దలకు క్రౌర్యము ప్రధానగుణము.

9. ఉదురు మిడుకు; [హర 5_10]

దుర్మార్గుడు, దుశ్చర్యలచే భయము కలుగఁజేయువాడు.

10. ఎముకలేఱుట: [శృ. నై 7_81]

చంపుట. శవదహనము తర్వాత నస్థిసంచయమునకు సంబంధించినది.

11. ఏమొగమున [కాశీ 5_324]

సిగ్గుపడుట. తాను కూడని పనిచేసినగాని, చేయదగునది చేయకపోయినగాని, తన మొగమును కావలసినవారికి చూపలేకుండుట. వారేమందురో యని మొగముచాటు చేసికొనుట. "ఏమొగముతో వారి యొద్దకు పోగలను" అని

---

( 11 వ పేజీ తరువాయి )

పరిధి, తాత్త్విక విశ్వాసభారమూ దురాక్రమణ చేస్తాయి. వారి వ్యక్తిగత విశ్వాసాలు, తర్కాలు, పాండితీవైభవాదులూ పాత్రలతలలపై మర్దనా చేయడమే జరుగుతుంది తప్ప - ఈ సన్నివేశంలో, ఈ సంస్కార బలంతో, యీ విద్యాపరిధిలో పెరిగినపాత్ర ఇలా మెలగగలుగుతుందా అన్న ఆత్మవిమర్శ ఆయన రచనకు లోపిస్తుంది. విశ్వనాథవారు సాహిత్య విమర్శకులుగా గణనీయులేకాని, ఆత్మవిమర్శనాపరతంత్రబుద్ధి లోపించడంవల్ల వారి సాహిత్యం నందనోద్యానవనం మాదిరిగా గాక నైమిశారణ్యంభాతిగా నిర్మాణదక్షతను పోకార్చుకుంది.

అనగా ఈ మొగమును చూపించజాలనని భావము.

12. ఒకటత్తుకయగు: [హార 2_60]
'ఏకగ్రీవము' అనుదాని కనువాదము కావచ్చు. ఏకాభిప్రాయమునకు వచ్చు. ఒకేమాటపైనుండు అని యర్థము.

13. ఒట్టుపెట్టినయట్లు: [కాశీ 7_136]
ఒట్టనఁగా ప్రమాణము. సాధారణమగు పలుకుగాక, దానికి కొంతయెక్కువ విలువ నిచ్చుట. మిక్కిలి పంతము పట్టినట్లు అని యర్థము.

14. ఓంకారమాచరించుట
[శృ. నై 2_69]
అంగీకరించుట. సంస్కృత భాషయందు అంగీకారమును సూచించుటకు 'ఓ' మ్మని యనుట సంప్రదాయము.

15. కడుపారనిపెట్టు: [శివ 3_19]
కడుపుచూచిపెట్టు. ఆకలితీరునంతదనుక ఆదరముతో భోజనముపెట్టుట.

16. కనుఁగాపు: [హార 3_11]
దాసాను దాసుడు. కనుసైగను గ్రహించి పనిచేయు సేవకుడు.

17. కన్నుమొఱఁగు [భీమ 1_111]
మోసగించు. కనుచాటు చేసికొని కనిపింపకుండ మోసముచేయుట.

18. కాటఁగలియుట: [హార 2_99]
నాశనమగుట. 'కాడు' అనగా స్మశానమనియు, అడవి యనియు నర్థములు. కనుక నేటియందు కలియుట యనగా మరణించుట యని భావము.

19. కానక కన్న సంతానము
[శృ. నై 1_108]
లేక లేక పుట్టినబిడ్డ.

20. కుక్కలుం బడనిపాటులు
[హార 3_15]
చాల యగచాట్లుపడుట. కుక్కలను నీచముగా చూచు పద్ధతిపై నేర్పడిన పలుకుబడి కావచ్చును.

21. కూపమండూకము: [భీమ 1_15]
ప్రపంచము తెలియనివాడు. నూతిలోని కప్పకు తానున్న నుయ్యియు, పైనున్న ఆకాశమునుకాక యితరములెట్లు తెలియవో యట్లే యనిభావము. ఆకప్ప ప్రపంచ మంతయు నింతియ యనుకొనును. అట్లే అల్ప పరిజ్ఞానము కలవాడును తెలియక యిట్లే యనుకొనును. కూపస్థమండూక మని వాడుక.

22. కొంగుబంగారము: [క్రీడా. 52]
సులభ సాధ్యమైనది. మిక్కిలి అందుబాటులోగలది.

23. కొండపట్టుట: [కాశీ 6_21]
దేశాంతరగతుడగుట. తలదాచుకొనుటకై తిప్పలు పడుట.

24. కొయ్యతనములు: [కాశీ 6_21]
దుడుకుపనులు. కటికవా రెట్లు దయలేక దుడుకుగా ప్రవర్తింతురో యట్లే ధూర్తతతో పనులుచేయుట,

25. గర్భయాచకులు: [హార 3_15]
పుట్టిన నాటినుండు బిచ్చగాండ్రు. ఆగర్భశ్రీమంతుడు. గర్భదరిద్రుడు. గర్భశత్రువు మొదలగువానివలె నీపలుకుబడి కూడనేర్పడినది.

26. గుమ్మడిమూటగట్టుట:
[క్రీడా 45]
గుమ్మడిపండు నాకారములో నున్న మూట. గుండ్రముగా నున్నమూట.

27. గొడ్డువీఁగుట: [కాశీ 4_87]
సంతానము కలుగుట. వంధ్యాత్వము పోయినదనుట.

28. చంకదుడ్డు శరణార్థి:
[హార 7_17]
అననురూప ప్రవర్తన. పైకి అభయమును కోరుచువచ్చినటుల నటించుచున్నను వీలుచిక్కినచో కొట్టుటకు చంకలో కఱ్ఱను దాచికొని వచ్చినటుల ప్రవర్తించుట.

29. చంకలబంటిగా మెసవుట:
[క్రీడా 56]
ఎక్కువగాతినుట. ఉదరము బాహుమూలములవరకు వచ్చునట్లుగా తినుట. గొంతువఱకుతినుట అనుపలుకుబడి వాడుకలో గలదు.

30. చందమామఘుటిక:
[భీమ 2_135]
అలభ్యమగునది యని అర్థము. చందమామను చూపుచు వట్టి వ్రేళ్ళు నోటిలో పెట్టగావారు చప్పరించెద రని యర్థము. చందమామనే గుళికగా భావించి దానిని మ్రింగ ప్రయత్నించువారి కది యలభ్యము. అట్టివాడు గుటకలు మ్రింగవలసినదే.

31. చచ్చిబ్రదుకు [శృ. నై 2_138]
చచ్చునంతటి ప్రమాదమువచ్చియు గండముగడచి జీవించుట. పునర్జన్మసదృశమగుట.

32. చిఱుబంతిపసుపాడు:
[భీమ 2_28]
స్నానముచేయుట. గాఢమైనచాయగల చిఱుతరకపు బంతిపూలచాయ పసుపని యర్థము. స్త్రీలు స్నానసమయమునఁ బూసికొను పసుపుపూత.

33. చివ్వకుఁ జేయిసాఁచుట:
[కాశీ 6_180]
యుద్ధమునుగోరుట. కలహము నాహ్వానించుచు జేయిసాచుట. కయ్యమునకు కాలుద్రవ్వుటవంటిది.

34. చెట్టునఁ బుడికినట్లుండుట:
[కాశీ 7_234]
అచ్చముగానుండుట. చెట్టునఁగోసిన వెట్లుమార్పులు లేకుండ నచ్చమై యుండునో యట్లే యుండుట. కృత్రిమ వేషమైనను సహజముగా నున్నదా యనునట్లుండుట.

35. చెడ్డయింటి చెదారము.
[కాశీ 4_91]
ఎవరి పోషణలేక తనకుతానుగా పెరుగువ్యక్తి.

36. జలంబుపాలగుట : [శృ. నై 8-79]

నశించుట, వరదపాలగుట

37. డస్సిదట్టమగు: [కాశీ 644]

చచ్చినంతపనియగు, పూర్తిగా అలసిపోవు. చర్మకారులు పశువుల చర్మమును దట్టమని వ్యవహరింతురు. జీవములులేక వట్టితోలుమాత్రము మిగిలిన దనియనుట.

38. తిలలు పైకెత్తిచల్లిన దిగువబడని యంత సందడి. [శృ. నై 4-123]

జనము చాల క్రిక్కిరిసియుండుట. 'ఇసుక చల్లినరాలని' అనివాడుక.

39. త్రాడువడుట : [భీమ 4-107]

నిస్సత్త్వమగుట. వివశతవలన నిస్సత్త్వమగుట. త్రాటివలె సన్నవడి బలహీనపడి చైతన్యము తరుగుట.

40. దర్శనమిచ్చుట : [కాశీ 4-66]

కానుక సమర్పించుట. రాజులు మొదలగు పెద్దలనుగాని పసిబాలురనుగాని చూచుటకు పోవునపుడు వట్టిచేతులతో పోకూడదు. కనుక వారి కేదైన బహుమానమును. తీసికొని పోవుటనుబట్టి దర్శనమునకు కానుక యను నర్థమేర్పడి యుండును.

41. నట్టేటముంచుట : [ప. వీ 110]

నాశనముచేయుట. నట్టేటిలోనికి తీసికొనిపోయి యచట ముంచిన చచ్చుట నిక్కము. అట్లే యేదేని వ్యవహారమున మధ్యలో మోసగించుట.

42. నీడతోఁచుట : [హర 4-52]

నిర్మలముగా నుండుట. ప్రతిబింబము కనిపించునంతగా తేటయుండుట.

43. నెత్తిఁజేతులిడుట : [కాశీ 2-156]

చాల దుఃఖించుట. నెత్తిమీఁదఁ జేతులిడుకొనుట దుఃఖసూచన. నేడు నెత్తిని జేతులిడుట అనగా మోసమువలన, నాశనముచేయుటకు వాడుచున్నాము.

44. నోరుమాలిన జంతువు : [కాశీ 5-345]

మూగజీవమనుట. మానవేతరములగు జీవములు మాటాడలేవు. దానినే యొత్తిచెప్పుట యిచ్చటజరిగినది.

45. పండ్లుగొఱుకుట : [శృ. నై 7-130]

కోపోద్రేకము కలుగుట. కోపాతిరేకమున పండ్లు కొఱుకుటనుబట్టి యేర్పడిన నుడికారము.

46. పాఱెడు నీళ్ళకుఁ గట్టవెట్టుట : [కాశీ 7-122]

ప్రయోజనకారి కాదనుట. అట్టిపని చేయఁబూనుట అవివేకము.

47. పులియుట : [కాశీ 7-132]

విఱ్ఱవీఁగుట. పులిసినవస్తువెట్లు మత్తును కలిగించునో యట్లే మదించి విఱ్ఱవీఁగుట.

48. మాయలేడిని బట్టికట్టుట : [హర 3-145]

దుర్ఘటకార్యము. రామాయణములోని మాయలేడినుండి యేర్పడిన నుడికారము.

49. ముక్కుమొగము చూచుట : [భీమ 3-8]

మోమోటపడుట.

50. మూడుకాళ్ళముసలి : [శృ. నై 1-108]

చాలముసలియనుట. ఊతకోలలేనిదే యడుగిడలేని స్థితి. ఆలంబన యష్టియే మూడవకాలు.

51. విభూతిరొసఁగుట : [హర. పీ 14]

భోజనమునకు లెమ్మనుట. గంధాక్షతలు భోజనసందర్భమున నిచ్చినట్లే శైవులు విభూతి నిత్తురు.

52. విస్తరిబండికన్నగుట: [ప. వీ 91]

పెద్దదిగాకనిపించుట. విస్తరివంటి చిన్న వస్తువైనను బఱడి చక్రమువలె పెద్దదియైనట్లు కనుపించుట. భయంకరముగా నుండుట.

53. శివార్చనచేయుట : [హర 2-47]

భోజనముచేయుట. దేవతార్చనయైన తరువాత భోజనముచేయుట. శిష్టులపద్ధతి ఇట్టు శైవులు కనుక స్పష్టార్థ ప్రతిపత్తికై శివార్చనయనుట.

54. శివశివా : [భీమ 3-126]

ఎంత యదృష్టముకలిగె నని అభినందించుట. నేటి కాలమున 'శివశివా !' 'రామరామ !' అనిపలుకుట కష్టసమయముననే.

55. సంచకరము : [శివ 3-68]

వెల నిర్ణయింపబడినతర్వాత, వ్యవహారమునుగట్టి చేసికొనుటకై యిచ్చిపుచ్చు నానెడిసొమ్ము.

తామర తంపరమైన ఈ తెలుగు నుడికారములన్నియు శ్రీనాథుని కావ్యోద్యానమున పూలజొంపములై గుబాళించుచున్నవి. శ్రీనాథు డనిన ప్రతిభావ్యుత్పత్తులు రెండును కరగిపోసిన రూపము. కవితాబాహ్యరూపమైన పద్య రచనము, పదగుంఫనము, నుడికారపుసొంపు భావ శిల్పములలో ఈతని మార్గమొక యనన్యసాధారణమైనది.

ఆధారగ్రంథములు :

గ్రంథసంకేతము : గ్రంథనామము.

1. కాశీ — కాశీఖండము
2. క్రీడా — క్రీడాభిరామము
3. ప. వీ — పల్నాటివీరచరిత్రము (బాలచంద్రునియుద్ధము)
5. భీమ — భీమఖండము
5. శివ — శివరాత్రి మాహాత్మ్యము
6. శృ. నై. — శృంగారనైషధము
7. హర — హరవిలాసము

# గులాబీ విలాపము

– శ్రీమతి జి. కమలారాఘవన్

ఉ. శ్రీయువ భారతీ విమల జీవనసూరి సుమంబులార, హా!
నాయము దప్పితా నిలనొనర్చిన దుర్భరమా విధాతయ
న్యాయ మగాధమూచు విరహాంబుధి లోపలద్రోచినట్టియీ
మాయనిగాథ నాయదియు మానక జాలి వినంగ గోరెదన్.

ఉ. పూవులలోన మేటినని భూజను లెన్నగ సొంపుగుల్కియున్
తావి వెలార్చుచున్ దళవితానమునందలి కెంపుచాయలన్
భావమనోహరం బగుచు భాసిలు రూపము నంది, నే తగన్
పావనజన్మ మెత్తితి శుభప్రదమైన గులాబిపూవుగాన్.

ఉ. ఎత్తిన జన్మకున్ ఫలము నీ భరతాంబకు ముద్దుబిడ్డ, లో
కోత్తరమూర్తియై వెలయు నూర్జితభావుడు నెహ్రుజీ రహిన్
హత్తిన ప్రేమ నామనము నంతట దోచి మనోజ్ఞసంపదా
యత్తవిలోకనంబుల నయంబున గ్రుచ్చియు నెత్తిముద్దిడెన్.

సీ. కొమ్మకొమ్మకు నేగి కోర్కెలూరగ తమి
కొననున్న నన్నందిమూర్కి జూపు
రెమ్మరెమ్మకు నేగి నమ్మిక వెలయంగ
నిమ్ముల నన్వంచి నెమ్మిజూపు
మొగ్గ మొగ్గకు నేగి సిగ్గునడాగునా
నిగ్గుల పసికట్టి మొగ్గుజూపు
పూవు పూవున కేఁగి పొలుపొందునా పూవు
సొంపు డెందము నింపి యింపు జూపు

తే. దిన దినంబును నాయందె దీక్షగల్గి
వలపు లెల్లను నాయిందె నిలిపి సతము
దాత నేతయు దైవంబుతానె యగుచు
సాకి తుద కిట్లు ననువీడె జవహ రకట.

సీ. భృంగమైనాలోని పూఁదేనియను గ్రోలి
మోహంపులహరిలో మునుగువాడు
తెమ్మెరైనాలోని కమ్మతావులఁబీల్చి
ఘ్రాణంబుతృప్తిగా గవయువాడు
నేస్తమైనాలోని నెయ్యంపు పుప్పొళ్ల
జల్లులాడుచు విలసిల్లువాడు
కాంతుడై నాలోన గ్రాలు నందము నెల్ల
కొల్లలాడుచు వేడ్కగులుకువాడు

తే. మమత నాయెడ బెంచియు మరులు నించి
కంచుకంబున దాల్చి నన్ కాంతు గదుర
దేశసౌభాగ్యమును వినుతింపజేసె
సాధుగుణవర్తి భారతచక్రవర్తి.

సీ. విరిబాల లెందరో వెలయంగ మన్నిడు
నన్నేల ప్రేమించె నళినగర్భ
ప్రేమించినను నింతగా మమకారము
నెలకొల్పగా నేల జలజభవుడ
నెలకొల్పినను నిట్టి మరులేల సచివుండు
వహియించె నాపయి భారతీశ
వహియించినను నింత భావంబు నాథుండు
విరియింపగా నేల హారిసమార

తే. ఇన్నిమాట లవేల నన్నెందు కిలను
బుట్టజేసితి బుట్టించి చెట్టబట్టి
నట్టిచెలికాని దూరానకనిపి తకట
విరిగ పుట్టకున్నను నిట్టి వెత కలుగునె?

సీ. స్వాతంత్ర్య మానస సాధువీణలపైని
రాగమాలికలల్లె రాణనెవడు
త్రిగుణాత్మకములౌచు దివితాకు జాతిప
తాకముల్ ధరనిల్పె తాల్మి నెవడు
నింగిజేగంటలు రంగు మీరగ మ్రోయ
రాజ్యపీఠం బెక్కి గ్రాలెనెవడు
బాలబాలికలందు ప్రాణమై మెల పొంది
ముదము నించిన యట్టి సదయు డెవడు

తే. అట్టిలోపకారి జితాఖిలారి
పుణ్యసంచారి సకల భూభువనహారి
కీర్తిమణిహారి పేదల కార్తిహారి
జవహరుని విస్మరింపఁగా జాలు టెట్లు?

సీ. అమృతవాహినివోలె నలరు సుబోధల
నేవేళ వినుచు వారెవ్వరింక
ఆసేతు హిమగిరి వ్యాప్త భారతయశో
హేల బోషించువా రెవ్వరింక
వాదభేదంబుల వదలించి బాపూజీ
హృదయము దెల్పువా రెవ్వరిం!
ప్రజల నందర, నేకపథములో నడిపించి
హితమును గూర్చువా రెవ్వరింక

తే. ఎన్నొ ఘనతర కార్యంబులిలను జేయ
జవ్వారుకు దక్కనొరులకు సాధ్యమగునె
ఇట్టి ఘనుగొనిపోవ నీకెట్లు చేతు
లాడె దైవమా నే నింకజూడ రాడె.

సీ. ఈ స్వారాజ్యమ్మింక నేలని సురరాజ్య
పట్టంబుకై కొంటె పరమశీల
ఈ రణరంగంబులేలని దివినాట్య
రంగము జేరితే ప్రాభవమున
ఈ జానపద గీతలేలని యమరగీ
తలు విననేగితే ధర్మచరిత
ఈ హిమాద్రిని నుండ నేలనిరజతాద్రి
విహరింప నేగితే వీత కలుష

తే. స్వర్గవాసులు నినుజూచి సరసదృష్టి
కోరి సేవించి నీపైన కూర్మిదనర
నందనోద్యాన సుమవారి విందుసేయ
ఈ గులాబిని మరచితివే మహాత్మ.

సీ. వీరనూన ప్రభావిసరముల్ వెలయించు
ఖచరుండి తండె పంకజములార
దరహాస చంద్రికల్ సురుచిరంబుగ జల్లు
నెలరాయడా తడే కలువలార
అందచందముల కన్విందుజేయుచు
నుండు వలరాయడాతడే వనుళలార
పంటవలంతికి ప్రాభవంబున శిరో
భూషణం బాతఁడే పొన్నలార

తే. అట్టి నెహ్రూజీ మరువంగనెట్టులౌను
సకల కుసుమ మంజరులార యికను నాడు
చెలువమెల్లను వనిపాల జెల్లెగాదె
గడచినట్టి సుదినములు కలలె యయ్యెం.

ఉ. మల్లియలార నాప్రభుని మాటదలంపగ మానసంబువే
ఝల్లను, శోకమాపగను జాలధరాస్థలిదేహమిట్టులే
చల్లగరాలిపోవుగద సాకెడినాథుడులేని జీవమున్
కల్లగదా ధరించుటయు గాంచగ నిద్దర సాధ్వికెందునన్.

ఉ. తేరును కృంగినట్లు మణి దిక్కరి గూలినయట్లు కోవెలన్
హారతి యారినట్లు కన కాచలశృంగము దొర్లినట్టు లా
తారకజారినట్లుహిమ ధాముడు భానుడు త్రోవదప్పిన
ట్లీరహి నెహ్రూ కన్మొరగ నిద్దుర దోచెడి నీ గులాబికిన్

ఉ. నావలెనీవు పావురమ! నమ్మిక జవ్వారుగోల్పొటన్ మనం
బావిభుపైని బారగ, విహంగమ పాటదివంబుకేగుదే
ఆవిధి నోచనైతికద యారయ రెక్కలు గల్గియున్ వచిం
చీవట జన్న కోరి విడ నేల యటంచు గులాబిమాటగాన్.

---

# ఋతు వర్ణనము

– శ్రీ 'నిశాపతి' ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు.

తరుణ నవామ్ర పల్లవ వి
తాన సుగంధ మనోజ్ఞ వీచికా౽
వరణవనాంత సీమల న
వారుణ పుష్పవ ఘూటికాక పో
లరచిత కుంకుమచ్ఛవి వి
లాసములో యన నొప్పె మంచుపై
పరచిన లేత వెల్గుదొర
బంగరు చేతులు చైత్రిప్రొద్దులన్.

అపుడే జీవము నింపుకొన్న భువి యా
హాభీష్మగ్రీష్మాతపో
గ్రపిపాసానల శుష్కవక్త్రమొయనన్
వ్రయ్యల్ పడన్ మేదినీ
విపులాంకమ్మున మేను దాచుకొనుచున్
భీతిన్ కడున్ నిస్సహా
యపు ప్రాణుల్ బెగడొంది వెల్వడియె
స్వీయ ప్రాణరక్షార్థమై.

మబ్బుల కౌగిటన్ దగిలి
మధ్యను జిక్కిన వెల్గురేనిపై
నుబ్బిన రోష భావముల
నుత్పలముల్ ముకుళింప నంతట
బ్బిబ్బగుజోడు దల్చి కనె
బెంగ మధువ్రతకాంత ఎల్లెడన్
గ్రబ్బిన ప్రావృడంబుదని
కాయపు గర్జలు వంత పెంపగన్.

వలువ మరాళ కాంతికి
మనంబున రంజిలి వాణి కంటివే!
ఇలపయి నాకుగాక మరి
యెవ్వరికిట్టివినిర్మల ప్రభా
విలసిత శుభ్ర సుందరవి
విక్త 'ముపాయనమున్నదే?' యన
పలుకుల దేవి పంతమున
పద్మజు సృష్టిని గేలిసేయగా
నిలిపెనొ అన్నటుల్ వెలిగె
నిర్మల శారదరాత్రు లెల్లెడన్.

( తరువాయి 17 వ పేజీలో )

# గ్రంథ సమాలోచన

## ఏణరాజు

[రచయిత శ్రీ మధురకవి విద్వాన్ శ్రీ వారణాసి వెంకటేశ్వరులుగారు. సాహిత్య కుటీరము నరసరావుపేట. మూల్యము మూడు రూపాయలు.]

ఆంధ్ర సరస్వతీ ప్రవాహము రాను రాను విశాలతరమైనది. అనువాదయుగము, ప్రబంధయుగము మున్నగువానిని దాటి చివరకు మతసంబంధ బంధములనుండి బౌద్ధాది మతవృత్తములలోనికి ప్రవేశించినది. జాతక కథలుకూడ కావ్యత్వము నందినవి. అట్లువచ్చిన వానిలో ఏణరాజు ఒకటి. దీనిని రచించినవారు శ్రీవారణాసి వెంకటేశ్వరులుగారు. వీరు మధురకవి విద్వాన్ బిరుదాంచితులు. నరసరావుపేట కళాశాలోపన్యాసకులు.

ఏణరాజు సుమారు రెండువందల పద్యములతో నున్నది. ఇందు నాల్గుచరణములు కలవు. బుద్ధుని శిష్యులు కొందరు దేవదత్తుడు కృతఘ్నుడని యనుకొనుచుండగా నటకు బుద్ధుడువచ్చి 'దేవదత్తుడు పూర్వ జన్మయందును కృతఘ్నుడే' యని యిట్లు చెప్పెను. పూర్వము ప్రకృతి సుందర గంభీరమైన యొకయడవిలో నొక లేడి కలదు. దాని శరీరము సువర్ణమయము. దానిజీవనము ప్రశాంతగభీరమై సర్వజనవంద్యమై యుండెను. ఇట్లుండ నొకనాడు భయంకరమగు గాలివాన వచ్చి సర్వము జలపూర్ణమై భయంకరమయ్యెను. జలప్రవాహములోఁ గొట్టుకొని వచ్చు మనుష్యునొకని నాలేడిచూచి వాని నొడ్డునకుఁ జేర్చి యుపచారాదులచే సేదదీర్చెను. వానికి సాదరాతిథ్యము నొసగెను. తాను ధనగుప్తుడనువాడనియు పితృపైతామహ ధనమును వ్యసనాదులచే వ్యయించి ఋణబాధ భరింపలేక యడవులబడి వరదలో జిక్కెననియు నాతడు తన వృత్తాంతము నెరిగించెను.

కొంతకాలమున కాతడుదారాపుత్రాదులనుదలచి గృహాగమనాభిలాష నెరిగించెను. లేడి వానికి సెలవొసంగుచు నీవు సుఖముగా నుండుము, కాని నాహిరణ్మయ శరీరత్వమును మాత్ర మెవ్వరికిని జెప్పకుమని ముదలకించి పంపెను. ఆతడు వల్లెయని వెడలెను. ఆదేశపురాజుభార్యకు కలలో బంగరులేడి కనిపించెను. ఆమె దానికై తహతహలాడెను. రాజు వేటగాండ్ర నంపెను. వారుహతాశులై తిరిగి వచ్చిరి. రాజుభార్య బంగరులేడిపై తహతహ పట్టజాలకపోయెను. చివరకు రాజు ప్రియభార్యాసంతృప్తికై బంగరులేడిని తెచ్చినవారికి రాజ్యార్థము నిత్తు ననెను. ఈవార్తను బంగరులేడికి మిత్రుడైన ధనగుప్తుడు విని వివేకలోభములమధ్య నలిగి తుదకులోభాకృష్టుడై రాజునకు బంగరులేడియునికి నెరిగించెను. ససైన్యముగా రాజటకుఁబోయెను. లేడి వారిని కొంత కికురించి చివరకు వారి కగపడెను. తన్నుఁబట్టవచ్చిన రాజునకు హిత వుపదేశించి కృతఘ్నుడైన వానికి దయతో నర్ధరాజ్యమిప్పించి రాజు కోరికపై వాని యాస్థానమునఁగొంతకాలముండి మరల తనయరణ్యమున కేగెను. ఈకథను వర్ణనచే, నుపదేశాదులచే రెండువందల పద్యములకు సుమారుగా కవిగారు పొడిగించిరి. ఇందు పద్యసంఖ్య నీయలేదు. మొదటి పద్యములో 'పునీత' పదము ప్రయుక్తమైనది. పూతమని కదా యుండును! వీరే 22వ పేజీలో పూత మయిన దటే 'యనుచోట' 'పూత' ప్రయోగము గావించిరి. 'పూఞ్' ధాతువునకు క్తాంతమున 'పూత' యగునుగాని 'పునీత' యుండదు కదా! రెండవపద్యములో 'కాశికసాఖ్య' గోత్రమున' యనిరి. కౌశికపదముకాని కౌశికస పదముకాదు కదా 'వాచావ్రతనిష్ఠుడు' (19పే) క్రీగీటుగీచిన సమాసము విచారణీయము. 'మురిసిపోయినదటే భరతమాత త్వదీయ జనన విశేష పూజ్యతను గాంచి.' ఇట భరతమాతయను పదము దేశ వాచకముకాక భరతమాతృవాచకమై షష్ఠీతత్పురుష కావలసియున్నది. 24పేజీలో

(తరువాయి 19 పేజీలో)

(16 పేజీ తరువాయి)

సహజ సుదీర్ఘ యామినులు
సాగె మరింత, ఉషఃకుమారికా
తుహిన ముఖావగుంఠనము
తూలె నొకించుక, నూత్నదంపతుల్
సహసిత తత్తదీయ గత
సంభ్రములై విడిపోయి రెట్టులో
విహిత హిమంపు ప్రొద్దుల భు
విన్ కడలెల్లెడ పుల్కరింపగన్.

రాలెడి పండుటాకులను
రక్తపుటశ్రులు చిందు వందగా
వాలెడి తొంటి సోయగపు
వార్తల నెంచుచు మోడువారి, రా
జాలెడి శోభలన్ గనుచు
సాంత్వన మొందుచు రేపు నాశతో
కాలమునీడ్చుచున్ ప్రకృతి
కాంత మనెన్ శిశిరర్తు వేళలన్.

—*—

# ఆనంద మందిరము

— విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.

శ్రేయము లొసంగి విజయ సంసిద్ధిఁ గూర్చి
ాభము సుఖంబు సమకూర్చి క్షోభఁ బాపి
తి నియమంబు ససద్ధర్మ నిచయ మొసఁగు
ుందర కవిత్వ మానంద మందిరమ్ము

పరమ పావన భారత నిరుపమాన
సంస్కృతికిఁ బ్రతి బింబమై సత్యధర్మ
నిస్తుల జ్ఞాన సంపద నిలుపఁ గలుగు
సుందర కవిత్వ మానంద మందిరంబు

బ్దపరిపుష్టి భావసౌష్ఠవము వ్యంగ్య
వైభవము రీతిసంపద ధ్వని విశేష
ుసమసుమపేశల సుశయ్య అతిశయించు
సుందర కవిత్వ మానంద మందిరమ్ము.

సౌరు మీరెడు రాయంచ చందమునను
మందగమనంబున నమంద మాధురియును
పదముల మయూర నృత్యంబు పరిఢవిల్లు
సుందర కవిత్వ మానంద మందిరమ్ము.

పచ్చ కప్పుర పలుకుల వాసనలును
సన్న జాజుల గుమగుమల్ చంపకసుమ
పరిమళంబులు కలువలపస యొసంగు
సుందర కవిత్వ మానంద మందిరమ్ము.

నవనవంబుగ వికసించి ప్రవిమల మగు
పద్మదళ శబ్దముల్ శుభ భావసూత్ర
సంగ్రథిత రత్నమాలికా చంద మందు
సుందర కవిత్వ మానంద మందిరంబు

దివ్య సుందర శారదాదేవి పూజ
విహితనిష్కామభక్తిఁ గావించుటకయి
ఆత్మ సంతృప్తియే ఫలమై చెలంగు
సుందరకవిత్వ మానంద మందిరమ్ము.

# అమాయికులు

— శ్రీ శ్రీధర సత్యవేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, ఎం. ఏ.

అందని మావిపండ్లకయి యఱ్ఱులు చాచక పోయిపాంథ, నీ
వందుకొనంగఁ జూచినను నందవు పైపయి కేగుచుండెడున్
అందు కొనంగ సాధనము లయ్యవి లేని యరణ్య మధ్యమం
దెందుననోయవున్న యవి యెట్టులునందగఁ జూచుటల్ వృథా.

అందని చందమామఁ దగ నందుకొనంగ వివేకహీనతన్
ఎందుకు పొంగుచుండెదవు? ఏమియెఱుంగని వాని పోలికన్
చందురు డున్న దాకసము సంద్రము! నీకది చాలదూరమం
దెందుననో కదా కలద దేవిధి నందగ జూచుటల్ వృథా.

అందని నాక భోగముల నందగ జూతువె నీచమానవా!
అందరికట్లు లభ్యమగు నయ్యవి పుణ్యము చేయకుండనే
ఎందుకు పిచ్చివానివలె నెక్కఁగఁబూనుట నాకమన్నతా
నెందుననో వెలుంగు నది యెట్లును చేరగ జూచుటల్ వృథా.

అందని భామ పొందుకయి యఱ్ఱులు చాచెద వేల మూర్ఖుడా
అందరు యోగ్యులే జగతి నామెను పొందగ, నెట్లు జూచినన్
అందదు నీకు తాను, మరి యన్నివిధంబుల భాగ్యమున్నచో
నందును లేక అయ్యది ప్రయాసమె యందగ జూచుటల్ వృథా

అందని కృష్ణప్రేమకయి యఱ్ఱులుచాచెద వేల బేలవై
యందదు రాధికా వినవె యాతనిప్రేమ యభాగ్యవీవు, నీ
ందును కాంచనాంబరము లాతని కీయగ నీవు చాలుచో
ందుకు వ్యర్థమాశ్రమ యభీష్టము తీఱదు వేఱుదారులన్.

( 17 వ పేజీ తరువాయి )

'కీర్తినల్దిక్కుల నింపినట్టిది కదే భవదీయ తరంగ రూపమే' ఇట కదా యనియున్న మరింత స్ఫూర్తిగా నుండెడిది. 25 వ పేజీలో రెండవ పద్యములో 4వ పాదములో 'శుష్కకీచకరంధ్ర నిష్కాస పవనాన మురళీ నినాదము మురువు సూప' ఇట 'నిష్కాస' కు బదులు నిష్కాసిత యన్నచో నర్థము సుస్పష్టమగును కాని యప్పుడు ఛందోభంగ మగును. దీనిని నిష్కాస పదకు బహువ్రీహి చేసిన సరి పోవును. దీనిని విశేషముగ గ్రహింప వలసియుండును. 53 వ పేజిలో రెండవ పద్యములో 'ప్రాతపురాణ సూక్తులు' సమాసము విచారణీయము. 68వ పేజిలో 3వ పద్యములో 'మిత్రద్రోహ దుష్కృత్యమున్' ఇట క్రీగిటుగిచిన పదము సాధువు కాదు. ఇట్టివి ఇందు కాన వచ్చును.

వర్షావర్ణనము మనోహరముగ నడచినది. 82వ పేజిలో దరదళిత పద్మబంధో, త్కరదళిమిథునములు కేళిసరణిన్ జపలో త్కర దింద్రనీల మణులనః బరివర్తన గతుల నెగిరె వర్షాహతికిన్' వంటిపద్యములం మనోజ్ఞములైయున్నవి. భోగవర్మ రాజ్యవర్ణనముననుగునవి బాగున్నవి. బంగరు లేడిని దెలిపినవారి కర్థరాజ్యము నిత్తునన్న ప్రకటనను విన్న ధనగుప్తునిలోని వివేక లోభముల ఘర్షణ బాగున్నది. అన్ని పద్యములా ఘర్షణను వివరించుట కవసరములాయనిపించును. ఇట్లే బంగరులేడి (ఏణరాజు) భోగవర్మ ధనగుప్తుల కలయిక, ఏణరాజు వాక్చాతురి ధర్మపరాయణత, సాత్వికత, ఉపకారబుద్ధి ప్రశంస నీయములుగా నున్నవి. రాజు భోగలాలసుడై భార్యాభీష్టమునకై బంగరులేడిని పట్టదలచి, దాని మహత్తునరసి వినమ్రుడై దానిఁబొగడి తనయాస్థానమునకు రమ్మనుట, రాజ్యపాలన చేయుమనుట చదివిన పిమ్మట రాజుచే నీవు రాజ్యమునకు వచ్చినచో నిన్ను దెత్తునను రాణి కిచ్చిన ప్రతిజ్ఞను నిలుపుకొనుట నీ మాటల వినుటయును సిద్ధించునను మాట రాజు రాజనీతిని దెలుపును గాని వాని ప్రకటితమైన పశ్చాత్తాపమునకు, అంత రాంతరముల ఏణరాజు యొక్క అను భావమహత్త్వమునకు భంజకముగా నున్నది. ఏణరాజు చెప్పినయుపదేశములు సుదీర్ఘములై యున్నవి. ఏణరాజు వాని కోరిక ప్రకారము వాని రాజ్యమున కేగి ధర్మబోధ చేసి యరణ్యమునకు తిరిగి వచ్చుట సముచితముగా నున్నది.

మొత్తము మీద కావ్యము రసవన్మార్గమున బయనించిన దని చెప్పవచ్చును. కవి మరింత జాగరూకత వహించిన పైనుదాహరించిన వానిని బరిహరించుకొన వీలయ్యెడిది. వీరింక మనోహరములైన కృతుల నేకములను రచించి భాషాసంసేవనమును, సహృదయావర్జకముగ నొనరింపగలరని యాశింపవచ్చును. దీనికి శ్రీ కాకర్లవారి 'పరిచయము' శ్రీ P. V. రమణారెడ్డిగారి పీఠిక, శోభావహములై యున్నవి.

— శ్రీ ప్రసాద్.

---

# ఈ పక్షంలో

## సమాలోచన వార్షికోత్సవ సభ

పైసభ 1-11-78 తేదీ సాయంకాలం 5గంటలకు రాజమండ్రి అల్యూమినియం మర్చెంట్సు అసోసియేషను హాలులో హుమారుక్లబ్బువారి యాజమాన్యమున జరిగినది. శ్రీ పోతుల వీరభద్రరావుగారు సభకి అధ్యక్షత వహించిరి. శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటు భరతనాట్య శాఖావిద్యార్థినుల ప్రార్థనశ్లోకపఠనంతో సభ ఆరంభం అయినది.

అధ్యక్షులు ప్రసంగిస్తూ రాజకీయాల జోలికి పోకుండా సినిమా విషయాలకి సంబంధం లేకుండా కేవల సాహిత్య వైజ్ఞానిక పత్రిక నడపడం అవసరం అయినా మిక్కిలి శ్రమ సాధ్యం అన్నారు. ప్రాచీన సాహిత్య వైభవాన్ని సామాన్య పాఠకులకు అవగాహన అయ్యేలాగున వివరించే రచనలు ప్రచురించడం సమంజసం అన్నారు.

ప్రఖ్యాత కవి శేఖరులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు సభా ప్రారంభం చేస్తూ పద్యకవితకు సముచిత గౌరవస్థానం ఇయ్యాలి. ప్రాచీన ఆధునిక సాహిత్యాలకు సమ ఆదరణ చూపుతూ ప్రాచీన సాహిత్యంవైపు మొగ్గుచూపాలి అన్నారు. పత్రికాప్రచురణ విశిష్ట సాహిత్య ప్రక్రియ. అది సరియైన పద్ధతిలో నడపినయెడల పాఠకులకు ఎంతో మేలు చేకూరుస్తుంది అనీ అందుకు ఎడిటరు సీతారామశాస్త్రి గారు సమర్థులు అనీ వక్కాణించినారు.

సంపాదకులు శ్రీ బులుసు సీతారామ శాస్త్రి గారు వార్షిక నివేదికలో పత్రిక ఆరంభింపబడిన విధము, పత్రిక నడపడంలో ఎదురయ్యే చిక్కులను అధిగమించిన విధమూ, వివరించిరి. రచయితల తోడ్పాటు, పాఠకుల ప్రోత్సాహమూ పుష్కలంగా అందుచున్నవనిరి. ప్రాచీన ఆధునిక సాహిత్యపు విలువలని సవిమర్శంగా నేటి పాఠకులకి అందించడం పరమార్థంగా పత్రిక నడపాలనే సంకల్పం అనీ అందునా కొన్ని చిక్కులు ఎదురౌతున్నాయి అనీ పద్యరచనలు ప్రోత్సాహకరంగా రావడం లేదనీ పద్యరచన చక్కగా చేయగలవారు కూడా గేయ రచనలపై మోజు చూపడం జరగుచున్నదనీ పెద్దలందరి సలహాలనీ వీలయినంత వఱకూ పాటించడానికి ప్రయత్నం జరగునని వివరించిరి.

శ్రీ తాడూరి కృష్ణారావు బి.ఏ.బి.ఎల్ గవర్నమెంటు ప్లీడరు వార్షిక ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తూ గ్రాంథిక వ్యావహారిక భాషలపట్ల సమాలోచన విధానాన్ని ప్రశంసించారు.

శ్రీ ఆర్. బి. పెండ్యాల ప్రసంగిస్తూ ఆంధ్రరాష్ట్రంలో అన్ని ప్రాంతాలకీ సులభసుందరంగా ఉండే వ్యావహారిక భాష పెంపొందాలి అనిరి. సంస్కృత సంబంధంలేనిదే తెలుగు భాషకి వికాసం లేదన్నారు. చక్కని భాషలో సమాలోచన వర్ధిల్లుతుంది అనడానికి సందేహం లేదు అన్నారు.

శ్రీ డాక్టరు కె. రామలింగ శాస్త్రి గారు మాట్లాడుచూ చదువరులకి ఆలోచనలని రేకెత్తించే మంచిరచనలని సమాలోచనలో చూస్తున్నాం అనీ వివాదాస్పదమైన రాజకీయాలలో తలదూర్చకుండా పత్రిక అభివృద్ధిచెందగలదని ఆకాంక్షిస్తున్నాను అనీ పలికిరి.

శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు (సరస్వతీ పవరు ప్రెస్సు ప్రొప్రయిటరు) మాట్లాడుచు పత్రికా ప్రచురణలోని ఇబ్బందులను సవివరంగా పేర్కొన్నారు. తగిన అడ్వర్టైజుమెంట్సు లేకపోతే ఎన్ని కాపీలు ప్రచురితమైతే అంత ఎక్కువ నష్టము వస్తుందన్నారు. సకాలంలో ముద్రణ పూర్తిచేయడం క్లిష్ట సమస్య అన్నారు. పత్రిక వర్ధిల్లడానికి సూచనలు చేసిరి.

శ్రీ సి. నరసింహాచారి అడ్వొకేటు, విజ్ఞానట్యుటోరియల్ కాలేజీ ప్రిన్సిపాలు విద్యార్థులకి ఉపయుక్తంగా ఉండే రచనలూ, సాహిత్య రచనలూ, చేయడంలో సమాలోచన సంపాదకులు సిద్ధహస్తులు అనిరి.

శ్రీ మహంకాళి కృష్ణమూర్తిగారు రిటైర్డు మోడలు స్కూలు హెడ్మాష్టరు గారు మాట్లాడుతూ సాహిత్య-విజ్ఞాన-ఆధ్యాత్మిక-విలువలుగల రచనలు సమాలోచనలో ప్రచురింపబడటం ముదావహం సమాలోచనలో సమఆలోచన స్ఫుటమౌతున్నది. అంటూ సంపాదకుల నిరంతర కృషిని ప్రశంసించారు.

అష్టావధాని శ్రీ బులుసు వెంకటరామమూర్తిగారు ఆశు పద్యరచనతో సమాలోచన చిరస్థాయికావలెనని ఆకాంక్ష తెలిపినారు.

హుషారుక్లబ్బు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్.రామకృష్ణారావుగారి వందనసమర్పణములతో సభ పూర్తియైనది.

## సాహిత్యావధానం

1-11-78 తేదీని రాజమండ్రి రోటరీ క్లబ్బు వారి యాజమాన్యమున గౌతమీ గ్రంథాలయం శ్రీమతి బాబాయమ్మ మెమోరియలు హాలులో సాహిత్యావధానం జరగినది. విద్వత్కవులు శ్రీ కర్రా చంద్రశేఖర శాస్త్రిగారు అనేక ప్రాచీన కావ్యములలోని పద్యరత్నములను శ్రోత్రపేయముగా ఔచిత్య పూర్వకముగా వ్యాఖ్యానము వివరించి సభ్యులనానందపరచిరి.

## అష్టావధానము

1-11-78 ఆంధ్రరాష్ట్రావతరణ దినోత్సవమును పురస్కరించుకొని రాజమండ్రి శ్రీ వీరేశలింగ పురమందిరమున శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు ఎం. ఏ. గారిచే అష్టావధాన ప్రదర్శనము జరపబడినది. మాజీపురపాలక సంఘాధ్యక్షులు శ్రీ పోతుల వీరభద్రరావుగారి అధ్యక్షతను విజ్ఞులు పృచ్ఛకులుగా పెక్కు పండితుల సమక్షమున అష్టావధానము సహృదయ మనోరంజకముగా అత్యంత జయప్రదముగా జరగినది.

## నవ్యభారతీ నిర్మాణాత్మక ప్రణాళికలు

నిజామాబాదు నగరమున నవ్యభారతి కార్యాలయమునకు ఇటీవల ప్రారంభోత్సవము జరిగినది. శ్రీ బద్దం నరసింహారెడ్డి గారు జ్యోతిని వెలిగించుచు కార్యాలయ ప్రారంభముగావించిరి. సభకు శ్రీ కవి గణపతి అధ్యక్షత వహించిరి. ధారావాహిక కవితా గాన పథకము క్రింద బహుమతి ప్రదానము గావింపబడినది.

ప్రస్తుతము నవ్యభారతి(సాహిత్య సాంస్కృతిక సమాఖ్య) రెండు నిర్మాణాత్మక ప్రణాళికలను చేపట్టినది. అందు మొదటిది సప్తాహచ్ఛందశ్శిక్షణా తరగతుల నిర్వహణ - ఇరువదిమందికిపైగా ఆబాలగోపాలము ఈ తరగతులకు హాజరగుచున్నారు. శ్రీ తంగుడిగె శ్రీధరరావు గారు ఈ తరగతులు ప్రతి ఆదివారము సాయంకాలము 3 నుండి 5 గంటలవరకు నిర్వహించుచున్నారు. ఛందస్సుతోపాటు తదనుబంధి శాస్త్రవిషయములు కూడా ఈ పాఠ్యప్రణాళికలో చేర్చబడినవి.

రెండవది ధారావాహిక కవితా గానము. ఇది ప్రతి మాసాంతపు ఆదివారము 11 నుండి 1 గంటవరకు నవ్యభారతీకార్యాలయమున జరుగును. శాశ్వత సాహిత్య సృష్టికి ఈ పథకము దోహదకారి కాగలదని దృఢవిశ్వాసము. సంస్థ వివక్షలేక ఎవరైనను ఇందు పాల్గొనుటకై నవ్యభారతీ వేదిక అవకాశము కల్పించుచున్నది. పరస్పరము కవులుసుహృద్భావపూర్వకముగా తమతమ రచనలను సమీక్షించుకొను సత్సంప్రదాయమునకు నవ్యభారతి శ్రీకారము చుట్టినది. తత్పరిణామముగా కవులమధ్య సాన్నిహిత్యము, పరస్పరావగాహన వృద్ధియగుటకు ఇది చక్కని అవకాశము. నవ్యభారతి చేపట్టిన ఈ జ్ఞాన యజ్ఞమున నెల్లరు సహకరింతురుగాక!

- కార్యదర్శి, శ్రీ టి. శ్రీధరరావు.

# బి. వి. అండ్ కో., పుస్తకములు

బి. ఏ., బి. యస్ సి., బి. కాం. తరగతుల I, II సంవత్సరముల తెలుగునోట్సు (ఆంధ్రా యూనివర్సిటీ) అన్నియు ముద్రింపఁబడి ప్రతులు సిద్ధముగా నున్నవి. కొన్నిరకముల ప్రతులు చాల తక్కువగా నున్నవి. త్వరపడుట మంచిది.

ఇంటరు I, II సంవత్సరముల తెలుగు, ఇంగ్లీషునోట్సు; X తెలుగు, ఇంగ్లీషు, హిందీ నోట్సు అన్నియు సిద్ధముగా నున్నవి. ఇంటరు తెలుగు ప్రోజు నోట్సు నూతన ముద్రణము పూర్తిఅయి ప్రతులు సిద్ధముగా నున్నవి. వెల రు 5-50 లు.

**బి. వి. అండ్ కో.,**

6 - 8 - 7, ఇన్నీసుపేట

రాజమండ్రి - 1.

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ ప్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు వీలైనంతవఱకు ప్రయత్నింపఁ బ్రార్థన.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

— సంపాదకుడు.

ఆడ్రసు :—

సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
**Retired Telugu Lecturer, V. T. J. College,**
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.

## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూముల వెల పోస్టేజీతోసహా రు 18-00 లు ఎం. ఒ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును.

— సంపాదకుడు 'సమాలోచన'

**Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.**